శ్రీరస్తు.

శ్రీనాథమహాకవిచే

రచియింపఁబడిన

భీమఖండము

అనునామాంతరముగల

# శ్రీభీమేశ్వరపురాణము.



నెల్లూరుకోర్టు న్యాయవాదులగు

వేంకటసుబ్బయ్య, ఎమ్. ఏ. గారిచే

లేఖకప్రమాదాదిజనితదోష రహితంబుగఁ

బరిష్కరింపఁబడి

మహారాజరాజశ్రీ

శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరు జమీన్‌దార్

తాలూకే, కోలంక, వీరవరము, వగైరాగారి

మద్రాసు యేజెంటు

క్రొత్తపల్లి వేంకట పద్మనాభ శాస్త్రిచేఁ

బ్రకటింపఁబడియె.

శివుఁడు. — "* * మణి కొనువాని వెతక

దవనిఁ గొనువాఁడె రత్నంబు నరయుఁ గాదె?"



1901.

# మూలమున నౌచిత్యము ననుసరించిన మార్పులు:—

| పుట. | పద్య. | పంక్తి. | | |
|---|---|---|---|---|
| 12 | 73 | 1 | అహమ్మదుశాసనదాన | అహమ్మదుసేనువదాన్య |
| 15 | 89 | 1 | మెరయించుచున్ | మెరయింపన్ |
| 19 | 109 | 49 | ప్రకారం | ప్రచారం |
| 23 | 8 | 2 | యనుజ్ఞంబరవృద్ధి | యనుజ్ఞఁ బురోవృద్ధి |
| 24 | 15 | 1 | మహోఘాయా | మహాదేవి |
| 31 | 59 | 1 | హేలనీలాతరంగిణీ | హేల నేలాతరంగిణీ |
| 32 | 72 | 2 | ముక్తేశ్వరు | ముక్తీశ్వరు |
| 33 | 78 | 1 | దర్దురగిరిమహా | దుర్ధరగిరిగుహా |
| 34 | 84 | 2 | ప్రణవ | ప్రణయ |
| ,, | ,, | 4 | జెప్పిరి | జల్పిరి |
| ,, | 90 | ,, | గ్రామంబెప్పుడు | గ్రామంబిప్పుడు |
| 35 | 101 | 4 | ప్రాసరేణ | త్రిసరేణు |
| 39 | 132 | 2 | వోయింపుచుండె | వోయింపనుండె |
| 46 | 18 | 15 | సంతప్యమాన | సంతప్యమానముని మండలంబును |
| 48 | 25 | 2 | వాఁడు | నతఁడు |
| ,, | 28 | 5 | గోదావరంబు | గోదావరాంబు |
| 54 | 74 | 6 | తంబుమాతీర్థ | తము రామతీర్థ |
| 63 | 165 | 6 | స్వరము | స్వనము |
| 64 | 177 | 6 | మొదలి | మొగలి |
| 65 | 179 | 4 | భానుజధార | భానుజవైరి |
| 75 | 27 | 2 | బ్రణుతి | బ్రణతి |
| 85 | 99 | 3 | నప్పుడేను | నారదుండు |
| ,, | ,, | 4 | బలిక్రాతి | బలెక్రాను |
| ,, | 101 | 1 | అనుచున్నేనిటు | అని నారదుండు |
| 86 | 108 | 1 | విరించులు | విరించులుపురందరాదులతోడ |
| 93 | 151 | 2 | యాస్థానంబు | యథాస్థానంబు |

| పుట. | పద్య. | పంక్తి. | | |
|---|---|---|---|---|
| 94 | 1 | 1 | తేజీవి | తోజీపీ |
| ,, | ,, | 2 | రీజీవి | రీజీపీ |
| ,, | 2 | ,, | తోన | తన్న |
| ,, | 3 | 1 | రథ్యాంతరే | రత్యంతరే |
| ,, | ,, | ,, | క్షత | కృత |
| ,, | ,, | ,, | ప్రకృతి | ప్యకృత |
| ,, | ,, | ,, | నాల్గవపాదము | శ్రీదత్తపుర్యధ్వపరోపిముక్తః |
| 95 | 166 | 1 | భరితాభయ | భరితోభయ |
| 97 | 184 | 2 | ఉగ్గడించి | ఉగ్గడింప |
| 120 | 142 | 1 | శివుమాహాత్మ్యం | శివభక్తిమాహాత్మ్యం |
| 127 | 3 | 1 | వినుము | వినుండు |
| 128 | 6 | 5 | నాక్షేత్ర | నేక్షేత్ర [డెః |
| 130 | 23 | – | – | 23 a వ॥ అఘమర్షణస్నానమ |
| 134 | 49 | 4 | పన్నగరాజ | పన్నగదీర్ఘ |
| 139 | 81 | 3 | ననుగ్రహించి | ననుగ్రహించె |
| 139 | 86 | 2 | మదియు | ముదిర [ర |
| 140 | 94 | 1 | అప్పర | వ్యాసర్షికనుగ్రహంబొసఁగియప్ప |

## ప్రథమాశ్వాసము.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 2 | నెలనాగ | నెలనాఁగ |
| 3 | వీధ | వీథి * |
| 5 | భల్లుర | భల్లుల |
| 1 | పెను | పిని |
| 3 | లురకు | లులకు |
| 11 | బాక | సాక |
| 1 | అకాశ | ఆకౌశ |
| 4 | లక్ష్మి | లక్ష్మి |
| 4 | ధారు | ధార |
| 3 | బుద్ధిఁ | బుద్ధి |
| 4 | గటిని | గటినిఁ |
| 1 | చూర | చూఱ |
| 3,4 | బుఁ, గా | బు, కా |
| 3 | గాల | కౌల |
| 2 | గోగు | గోఁగు |
| 1 | పుఁగ | పుగ |
| 2 | ◆క | క◆ |
| 2 | ప్రోత | ప్రోఁత |
| 5 | లోకంబులవలన. | లోకంబువలన |
| 49 | మహాద్భూపా | మహోభూపా |
| 3 | శాక్వర | శాక్కర |
| 2 | వేష్టింపచలి | వేష్టింపఁజలి |
| 7 | గన్నుగవ | గన్నుఁగవ * |
| 3 | ర్షణి | ర్షణ |

## ద్వితీయాశ్వాసము.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 4 | బోల్ప | బోల్పఁ |
| 1 | కన్న◆పెద్ద | కన్నఁ◆బెద్ద |
| 4 | కొమరు | కొమర |
| ,, | క్రేం◆కా | క్రొ◆క్కా |
| 2,3 | మెఱసె, పగమ | మెఱసెఁ, బరమ |
| 1 | ◆న | న◆ |
| 2 | నిద్దంపుచెక్కు | నిద్దంపుఁజెక్కు |

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 55 | 18 | శీతా | భీతా |
| 57 | 3 | గాపు | గాఁపు |
| 62 | 3 | లదూరి | లఁదూఱి |
| 66 | 2 | వృధ...తోటి, | వృథ...తోడి |
| 72 | 1 | రాయణగ్రా | రాయగ్రా |
| 80 | 2 | గొర్కు | గోర్కు |
| 101 | 4 | కోమల | కోమలపు |
| 105 | 2 | క్షీష | క్షీణష |
| 108 | 1 | షమ్ధ | షన్ధ |
| ,, | 2 | కాశ్యామ్ని | కాశ్యాన్ని |
| ,, | 2 | తామ్సదా | తాంసతాం |
| 110 | 2 | మచ్చకంటి | మచ్చెకంటి |
| 125 | 2 | ,, | ,, |
| 126 | 1 | న్నెలతుక | న్నెల్లఁతుక |
| 126 | 2 | జోడరుగుల | జోడరుఁగుల |
| 127 | 2 | గొడుగుపా | గొడుగుఁబా |
| 133 | 1 | బాగయు | బాగపు |
| 134 | 2 | వెల్ల | వెల్లఁ |
| 135 | 1 | అవు | అవుఁ |
| 135 | 2 | మిధ్యా | మిథ్యా |
| 139 | 3 | తాలి | తాలిఁ |
| 147 | 5 | చట్ట | చెట్ట |

## తృతీయాశ్వాసము.

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 2 | బులుకన్న, | బులఁ గన్న |
| 9 | 1 | నన్న | నన్నఁ |
| 15 | 4 | ప్రాహుణ | ప్రాహుణి |
| 17 | 5 | జస్వ | జస్స్వ |
| 20 | 1 | కోటివల్యుఁడు | కోటివల్యుడు |
| 21 | 6 | ణాబ్ధి | ణాబ్ధిఁ |
| 22 | 2 | లేఁడిం | లేడిం |
| 23 | 1 | నంస | నగ్స |
| ,, | 4 | లెక్కడయన్య | లెక్కడనన్య |
| 28 | 3 | సచ్ఛ్రుతి | సచ్ఛ్రితి |

* ఇట్టి చోటులం దీవిధముగ దిద్దికొనుఁడు.

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 31 | 4 | నున్నఁ | నున్న |
| 37 | 3 | కంకో | కంగో |
| 55 | 5 | మునఁ... రాజఁ | మున... రాజ |
| 66 | 2 | యందు | యంద్రు |
| 68 | 1 | మహా | మాహా |
| 99 | 1 | శ్రీకంధరుని | శ్రీకంధరునిఁ |
| 101 | 2 | గళుని | గళునిఁ |
| 174 | 2 | విను | విని |
| 178 | 3 | పలుకుపూ | పలుకుఁబూ |
| 193 | 6 | నాయకుని | నాయకునిఁ |
| 194 | 1 | నిన్ను | నిన్నుఁ |
| ,, | 5 | మిమ్ము | మిమ్ముఁ |
| 211 | 18 | పెరిగి | పెరిఁగి |
| ,, | 23 | భృంగ్వ | భృగ్వ |
| 215 | 5 | సేయ | సేయఁ |

చతుర్థాశ్వాసము.

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | సిత | స్థిర |
| 4 | 1 | విను | విని |
| 15 | 2 | నతని | నతనిఁ |
| 22 | 1 | వరమ్తీ | వరస్త్రీ |
| 30 | 2 | గవిని | గవని |
| 32 | 5 | హరుని | హరునిఁ |
| 60 | 9 | లయినపక్షు | లయినసపక్షు |
| ,, | 10 | తరం.. నొదుగ. | తీరం.. నొదుఁగ |
| 61 | 6 | విడు... తపె... | విడి... తఁబె.. |
| ,, | ,, | పెరుగ | పెరుఁగ |
| 62 | 1 | మింతుడు | మింతుఁడు |
| 85 | 1 | పురుషయఘో | పురుషాఘో |
| 93 | 2 | నుచైచ్ర్శవం | నుచ్చైశ్శ్రవ |
| 107 | 4 | దిగద్రావి | దిగఁద్రావి |
| 123 | 13 | బుచ్చి | పుచ్చి |
| 129 | 1 | గోగు | గోఁగు |
| 130 | 3 | బీట | బీఁట |
| 139 | 11 | బురాణబు | బురాణపు |
| 151 | 2 | యాస్థానంబు | యథాస్థానంబు |
| 165 | 1 | కాఘు | కాంఘు |
| 190 | 4 | తప | తపో |

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 191 | 4 | వటు | పటు |
| 200 | 3 | మైన | మైనఁ |
| 207 | 4 | చెప్పి | జెప్పి |
| 208 | 2 | దాఁక | దక్క |
| 210 | 6 | విను | విని |

పంచమాశ్వాసము.

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 3 | వ్యథా | వ్యథా |
| 8 | 19 | గ్రంథ | గ్రంథి |
| 8 | 20 | తురంగలి | తుఱంగలి |
| 8 | 21 | వెలుగు | వెలుఁగు |
| 8 | 31 | స్ఫాల | స్ఫాల |
| 22 | 3 | కుంవా | కుంస్వా |
| 50 | 1 | థాన... నందీ | థాన... న |
| 52 | 13 | మముఁబోటి | మముబో |
| 52 | 20 | అజ్ఞా | నజ్ఞా |
| ,, | 25 | ఓసర్వ | యోసర్వ |
| ,, | 29 | నమఃఅని | నమయని |
| 65 | 1 | మొప్ప | మొప్పఁ |
| 68 | 3 | చినం | చినఁ |
| 69 | 2 | బెరు | బెరుఁ |
| 75 | 2 | సస్యం | ససస్యం |
| 76 | 1 | మేఱ | మేర |
| 80 | 4 | మేఱ | మేర |
| 105 | 3 | నంతప | నంతఁబ |
| 110 | 1 | మగఁటిమిఁజె. | మగటిమిఁ |

షష్ఠాశ్వాసము.

| పద్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 2 | య్యేఁటి | య్యేటి |
| 26 | 1 | ఏఁట | ఏట |
| 57 | 2 | ఛటఛటా | ఛటచ్ఛటా |
| 66 | 2 | పీఠ | పీఠి |
| 71 | 1 | తిరి | తిరు |
| 74 | 1 | స్వర్లో | స్స్వర్లో |
| 75 | 24 | బునుమరగి | బునమరఁగి |
| 79 | 4 | కంఠయ | కంఠయు |
| 106 | 4 | మంబులంన. | మంబులన |

శ్రీ



## విజ్ఞప్తి.

ఆంధ్రులారా,

మన భాషయందనేక కవిసార్వభౌములనేక కబ్బంబుల రచియించి మించిరి. అవియెల్ల నాఖుశుశుక్షణిశిథిలబంధనాదిపీడలచేఁ దఱచుగ నశింపఁగా మిగిలినవి కొన్నియేయున్నవి. తక్కినవి కొన్ని నామమాత్రావశిష్టంబులై గ్రంథాంతరోదాహృతస్వపద్యంబులచే వానిమహిమనూహింపఁజాలు పండితవరేణ్యులమనంబులం గడలేని చింతరగుల్కొనఁజేయఁజాలి యున్నవి. ముద్రాయంత్రాద్యుత్తమసాధనానుపపత్తిచేఁ బూర్వమీపీడ యనివార్యంబైయుండెఁ గాని యిక్కాలంబున నేమో, మిగిలినవానిని భద్రపఱచుకొని మనకును మనవెనుకటివారికిని భద్రంబొనగూర్పఁ దగునుపాయంబు లనేకము లేర్పడియున్నవి. వీనిని మనమెట్లుపయోగించుచున్నాము? దాన మనభాషయందలి గ్రంథసంచయమెంత రక్షనొందినయది? యనుటనాలోచింపవలసియున్నది.

ప్రకృతమందు మనభాషయందు విలువకుం దొరకు గ్రంథముల రెండు తెఱంగులవిభజింపనగు. ఉల్లిపొరలవంటి కాగితంబులపైఁ దగిలియుఁదగాలక యచ్చొత్తింపఁబడి తప్పులకుప్పలై యతిదూష్యంబులై నెగడు 'గుజిలీ' పుస్తకములుకొన్ని. ఇపుడుండెడు పుస్తకములలో మూఁడుపాళ్లిట్టివియే. వీని వెల సులభము కాని ఫలము సున్న. వీనియందువర్ణలోపంబులె లెక్కకు మిక్కుటంబులై యున్నవన నిఁకఁ గేవలము పండితవేద్యంబులగుగణయతిప్రాసాదిలక్షణవైపరీత్యంబుల సంగతి వేఱుగఁ జెప్పవలయునా? దీనికినుదాహరణంబుగ నిట్టిగ్రంథమొకటినుండి యీ క్రిందిపద్యము లందున్నరీతిని ముద్రించుచున్నాము. చూడుఁడు.

"క. అటువచ్చినహరుడల్లమతటుకునదయ జూచిలేచితనపీఠికనొ । క్కటనునిచియి
ష్టబాషలు । నడియించియతండరుగ గౌరినాధునికనియెఁ."

"క. సాకారుండొధలపగని । రాకారుడొయాదిపురుషా కృతియిపుడుంగైకొనినఘ
నుడోయిట్లని । యాకమలాత్మజుడైననలవియె బొగడఁ."

ఇటుగాక మంచికాగితములపై నచ్చొత్తింపఁబడి చదువుటకుముందు చూచుటకింపగునట్లు సంపుటీకరణముగావింపఁబడియుండు నొకకొన్ని గ్రంథంబులిపుడిపుడు పొడసూపుచున్నయవి. ఇవి పండితపరిష్కృతంబులై నెగడుటచే వీనియందుఁ దప్పులు నంతగఁ గానరావు. అయినను వీని వెల యధికమగుటచేఁ బైకనిన 'గుజిలీ' పుస్తకములకును వీనికిని సవతిపోరు వాటిల్లఁగాఁ జిన్నతనంబుచే వన్నెకెక్కనయ్యవియే పామరులకుగ్రాహ్యములై మించెడిని. నిష్ప్రయోజనమగు వస్తువునకిడినయది యెంతయైనను నష్టమెకాయనివీరరయలేక యటుచేసినను గుణగ్రాహులగు కొందఱు మాత్ర మీయుత్తమగ్రంథంబులనె కొనియెదరు. అయిన నట్టివారి సంఖ్య కొద్దియగుడు గ్రంథములవెల యధికమ కావలయు. ఇందువలన నట్టి యు

ద్యమములయం దుత్సాహము కొఱవడును. ఈకొఱఁతను వారింపఁదగు నుపాయమెయ్యది? దీర్ఘాలోచనపై నీప్రశ్నకిది తగునుత్తరమని మాకుఁ దోఁచె. అదియెద్దియనిన:—కొంతనష్టమునకోర్చియైనను 'గుజిలీ' పుస్తకముల విలువయు నొందువానిగుణము నొక్కటఁ గూర్పవలయు. అట్లుచేయుటవలన రెండువిధములైన లాభముకల్గును. తక్కువవెలఁబెట్టి యీగ్రంథములఁ బామరులుఁ గొనఁజాలుదురు. దాన వారికి వీనికిని 'గుజిలీ' పుస్తకములకుఁ గల తారతమ్యము తేర్పడును. అంత నభ్యాసముచే గుణగ్రాహకత్వమేర్పడ గుణరహితమగు వస్తువులయం దరుచిపుట్టును. ఇదియొక లాభము. గ్రంథముల ముద్రింపించువారును మునుపటివలె నత్యధికలాభముఁ గోరక కొంతలాభముతోనె తృప్తిఁబొందవలసి వచ్చును. దాన సద్గ్రంథముల విలువయుం దగ్గును. ఇది మఱియొక లాభము. ఈరెండును గూడిన నాంధ్రప్రపంచంబునఁ గల గ్రంథసంఖ్యయుఁ జదువరుల సంఖ్యయు హెచ్చకమానదు.

ధనశాస్త్రసూక్ష్మముల నింతగఁ జర్చించు మేము మాకునష్టము కలుగు యత్నముంజేయుదుమనియు, దాన నీయుద్యమము కొనసాగదనియుఁ దలఁపవలదు. విశేషలాభమును మేము కోరలేదకాని నష్టమున కేమాత్ర మొడిగట్టలేదు. కావున మాయత్నము సఫలంబగుననుట కెంతమాత్రమును సందియంబులేదు. ఇఁక నదియెట్టిదనుట వివరించెదము కనుఁడు.

"శ్రీజ్ఞానప్రసూనమాలిక" యను పేరఁ గ్రమంబుగఁ బుస్తకరాజిఁ బ్రకటించుచుందుము. మాచేఁ బ్రకటింపఁబడు గ్రంథములెల్ల నునుపుచే మించు దళసరికాగితములపైఁ జక్కగ నచ్చొత్తింపఁబడి పండితపరిష్కృతములై వెలయు. పద్యంబులెల్లఁ బాదమునకొకపఙ్క్తియు యతిస్థానములంగుర్తును గలిగియుండును. సంపుటీకరణమును దృఢముగఁ జేయింతుము. ఇంతచేసియు వెల యించుమించుగ 'గుజిలీ' పుస్తకములకుంబలె యుండునట్లు నియమింతుము!! ఈకాలపుఁ దేనెలొలుకుమాటలంగల ప్రకటనలచే మోసపోయిన యనేకులు కాలక్రమంబున మాచేఁ బ్రకటింపఁబడు గ్రంథముల గౌరవముఁ గొనియాడఁగలరని నమ్ముచున్నాము. మాకుఁ 'జందాలు' ముందుగఁ బంపనక్కఱలేదు. భాషాభిమానులందఱు నీగ్రంథములం గన్నులారఁజూచినపిదప నాదరించినఁజాలు.

ఇట్లనివిన్నవించు
సుజనవిధేయులు,

ర॥ వేంకటసుబ్బయ్య ఎమ్. ఏ.
బ్రా॥ వేంకటపద్మనాభశాస్త్రి.

# శ్రీ

# శ్రీభీమేశ్వరపురాణము.

## పీఠిక.

---

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు శ్రీకాళహస్తీశ్వరుని యర్ధాంగలక్ష్మియు జగజ్జననియు నగు శ్రీజ్ఞానప్రసూనాంబకు భక్తిమెయి మేమర్పింపఁబూనిన "శ్రీజ్ఞానప్రసూనమాలిక" యందు ద్వితీయప్రసూనముగ నీభీమఖండ మనునామాంతరముగల శ్రీభీమేశ్వరపురాణముం గూర్చితిమి. ప్రథమప్రసూనమగు శ్రీకాళహస్తిమాహాత్మ్యము నిజవాసనావేల్లితాంధ్రప్రపంచంబై నెగడసాగి యైదేండ్లైనను ద్వితీయప్రసూన మింతకాలముపొడగానరాకుండుటకుం గతం బీగ్రంథమందుఁగలచిక్కులతోడఁ గేవలము ధనాఢ్యులముకాని మాయత్నములు ముద్రణాద్యవసరములందలసగతి వహించుటయ. ఈగ్రంథముయొక్క ప్రతులు చిక్కుట మిక్కిలియరుదు.

మహారాజరాజశ్రీ, సమర్థి రంగయ్యసెట్టి బి.యే. గారొక ప్రతియు, బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ, గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారొక ప్రతియు, బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ, పోతాప్రగడ బ్రహ్మానందముగారొక ప్రతియు మాకిప్పించిరి. ప్రాచీన పుస్తకభండారమునందు రెండుప్రతులు చిక్కినవి. బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ, దర్భా వెంకయ్య బి. ఏ. బి. ఎల్. గారు, సంస్కృతభాషలో ముద్రింపఁబడియుండు భీమఖండంబను గ్రంథంబొకటిని మాకొసంగిరి. వీనిని సహాయముగాఁగొని యీ భీమేశ్వరపురాణంబును మాశక్తికొలఁది సంస్కరించి వ్రాయించి ముద్రింపించినారము.

ఈగ్రంథమునఁ దొలుదొల్త విఘ్నేశ్వరునిఁ బ్రార్థనలోనె పద్యము వ్రాఁత ప్రతులయం దిట్లుండెను:—

ఉ. ఏనికమోము తెల్లెలుక నెక్కినరావుతు రాచవారు సే
నానియనుంగు పెద్దనవినాయక దేవుఁడు కర్ణతాళజం
ఝానిలమారుతంబున నిరంతరముం బ్రబలాంతరాయసం
తానఖినాఖినాఖినఖిదంతముల న్విదళించుగావుతన్.

ఈపద్యముంగూర్చి మే మెఱింగినపండితుల నందఱినడిగినారము కాని యొక్కొకరును గ్రుక్కిలుమ్రింగినవారలె. మార్పులు సూచించినవారలె. అయినను మా వ్రత మొకటి కలదు. అది యేది యందు లేని మేము ప్రకటించు గ్రంథములయం దా యాగ్రంథకర్త లేపదములు ప్రయోగించియుందురో వానిని సాధ్యమైనంత వఱకు నూహించి వేయవలయుననే కాని మాకుం దెలియనిచోట్ల నందు నక్షరములం దీసి పాఱవైచి మాకవిత్వ మిఱికించం గూడ దనుటయే. ఈనిర్బంధమునకు లోనైన మే మీ వినాయకస్తుతింగల పద్యముం గూర్చి పడినకష్ట మావినాయకునకే యెఱుక. ఇట్టి కష్టము లీగ్రంథమం దెన్నియో యుండినవి. వాని నెల్ల శ్రీజ్ఞానప్రసూనాంబ కరుణ చేతను బెద్దలసహాయమువలనను గడచి నేటి కీగ్రంథముం బ్రకటింపం గంటిమి.

ఇది పంచాశత్ఖండమండితం బగుస్కాందంబులోని యొక ఖండము. భీమఖండము నాఁబడు. గోదావరిజిల్లాలోని దక్షారామము లేక భీమేశ్వరం బనునొకశివస్థలమాహాత్మ్యముం దెలుపునది. ఆస్థలంబునకు దక్షిణకాశియను సంజ్ఞయుం గలదు. అది భోగమోక్షదం బనిప్రసిద్ధిం గాంచినది. దేవభాషయందు ముప్పదిరెండుసర్గలుగా విభజింపఁబడి యించుమించుగ రెండువేలశ్లోకములు గలయీగ్రంథమును నాంధ్రంబున శ్రీనాథుం డనుమహాకవి యాఱాశ్వాసముల గ్రంథముగ విరచించె.

శ్రీనాథుఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు నాపస్తంభసూత్రుఁడు బ్రాహ్మీవరప్రసాదలబ్ధుఁడును శివపూజారతుండు. ఈయనతలిదండ్రులు భీమాంబయు మారయయు. తాత పద్మపురాణంబును రచించిన కమలనాభామాత్యుఁడు. వీనికిం బ్రమాణంబు లెవ్వియనిన:—

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభా ♦ పస్తంభసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుం బు ♦ ణ్యాచార భీమాంబకు
న్గారామైనతనూజు నన్నఘు శ్రీ ♦ నాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించి పలికె ♦ న్గంభీరవాక్ప్రౌఢిమన్.

నైషధము.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురు ♦ ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళా ♦ శీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతా ♦ త్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీ ♦ భాగ్యంబుసామాన్యమే. నైషధము.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ ♦ కాల్పట్టణాధీశ్వరుఁ
ఘనుని న్బద్మపురాణసంగ్రహకళా ♦ కావ్యప్రబంధాధిపుఁ
వినమత్కాకతిసార్వభౌముఁ గవితా ♦ విద్యాధరుం గొల్తు మా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనా♦భామాత్య చూడామణిఁ. భీమ.

ఈకవిరచించిన గ్రంథములు మే మెఱింగినంతవఱకు నెవ్వియనిన:—

(1) నవమరుత్తుచరిత్రము.

(2) పండితారాధ్యచరితము; ఇది వేమారెడ్డి సేనానాయకుఁడైన మామిడి ప్రెగ్గడయ్యకు నంకితము.

(3) శాలివాహనసప్తశతి.

(4) నైషధము; ఇది వేమారెడ్డి సేనానాయకుని తమ్ముఁడైన మంత్రిసింగనకు నంకితము.

(5) భీమఖండము; ఇది వీరభద్రరెడ్డి మంత్రియైన బెండపూఁడి యన్నామాత్యున కంకితము.

(6) కాశీఖండము; ఇది వీరభద్రరెడ్డి కంకితము.

(7) వీథినాటకము.

(8) హరవిలాసము; ఇది వేమారెడ్డియొద్ద సుగంధ భాండాగారాధ్యక్షుఁడైయున్న సిరియాల తిప్పయ్య కంకితము

(9) పల్నాటి వీరచరిత్రము.

(10) నందనందనచరిత్రము.

(వేమారెడ్డియు, వీరభద్రరెడ్డియు నన్నదమ్ములు)

ఈ గ్రంథంబులు వ్రాయఁబడినవరుస కాశీఖండములోని యీ పద్యమువలన నొకింత తెలియును.—

సీ. చిన్నారిపొన్నారి ♦ చిఱుతకూఁకటినాఁడు-రచియించితి మరుత్త♦రాట్చరిత్ర
నూనూఁగుమీసాల ♦ నూత్నయౌవనమున - శాలివాహనసప్త ♦ శతినొడివితి
సంతరించితి నిండు ♦ జవ్వనంబునయందు - హర్షనైషధకావ్య ♦ మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయః ♦ పరిపాకమునఁగొని - యాడితి భీమనా ♦ యకునిమహిమఁ
బ్రాయమింతకుమిగులఁగై♦వ్రాలకుండఁ - గాశికాఖండమనుమహా♦గ్రంథమేను
దెనుఁగుఁజేసెదఁగర్ణాట ♦ దేశకటక - పద్మవనహేళి శ్రీనాథ ♦ భట్టసుకవి.

ఈ గ్రంథంబులు సంస్కృత జటిలంబులై ముద్దులుగుల్కు శైలిని సలక్షణంబగు భాషను వ్రాయఁబడియున్నవి. ఈకవివ్రాయు సీసపద్యములు చూడఁ జూడఁ జవులూరుచుండును.

ఈ యనకవిత్వ మిక్కిలి రసవంత మనుట యందీయనకుఁ గలిగియుండిన నమ్మకమునకుఁ గాశీఖండము కృతిభర్తయగు వీరభద్రరెడ్డిచెప్పినట్లు వ్రాయఁబడియుండు నీపద్యము నిదర్శనము. ఈకవి తన కావ్యములయం దేయేవిధముగ భాషను బోషింప యత్నించినదియు నీపద్యము తెలుపును:—

సీ. వచియింతు వేముల ♦ వాడ భీమనభంగి - నుద్దండలీలనొ ♦ క్కొక్కమాటు
భాషింతు నన్నయ♦భట్టుమార్గంబున - నుభయవాక్ప్రౌఢినొ♦క్కొక్కమాటు
వాక్రుత్తుతిక్కయ♦జ్వప్రకారము రసా-భ్యుచితబంధముగనొ♦క్కొక్కమాటు
పరిఢవింతుప్రబంధ ♦ పరమేశ్వరుని త్రోవ - సూక్తివైచిత్రినొ♦క్కొక్కమాటు.

శ్లో. "కాశీఖండమయఃపిణ్డం నైషధం విద్వదౌషధమ్"

అనునటుల దేవభాషలో మిక్కిలి కఠినములు నాఁ బ్రసిద్ధిఁ గాంచినకావ్యముల నీ కవిశిఖామణి సాహసించి తెనిఁగించెనన నీతనిసామర్థ్యమును గుఱించి వేఱుగఁ జెప్ప నక్కఱ యుండదు. ఈకవి వ్రాసినగ్రంథములలో గొప్పవియు రసవంతములును ముద్రితములు నగుకాశీఖండము నైషధ మనునవి భాషాంతరీకరణములు. తక్కినవియు నారసిచూచినఁ దఱచు దేవభాషలోని యెదేనొక గ్రంథము నందుండి వ్రాయఁబడినట్లె యేర్పడును. ఎట్లనం బ్రకృతము శ్రీసరస్వతియను మాసపత్రికయందు ముద్రింపఁబడుచుండు హరవిలాసమున 4 వ యాశ్వాసమున గౌరీతపస్సు, వివాహసందేశము మొదలగు పట్లం జూడుఁడు. కాళిదాసు కుమారసంభవమునకు యథాశ్లోకము భాషాంతరీకరణముగ నుండుట తెలియును. ఈకవివ్రాసిన భాషాంతరీకరణములు యథాశ్లోకముగ వ్రాయఁబడి యుండలేదు; ఈ విషయమున నీకాలపు భాషాంతరీకరణము లగు కుమారసంభవము శాకుంతలాది నాటకములు మొదలగువానితో నివితులఁదూఁగవు. తనతో సమకాలికుఁడైన బమ్మెరపోతనామాత్యుఁడు మూలమునను సరించినంత మాత్రముఁగూడ నీకవి యనుసరించియుండలేదు. దృష్టాంతములంజూడుఁడు:—

24-వ పుట 13 వ పద్యమున "సంతతము దేవవేశ్యాభుజంగుఁడతఁడు" అనియున్నది. దీనికి మూలము "సహిసర్వదేవరాట్" సాధ్యమైనపట్లనెల్లనిట్లు దేవునకేని గొప్పవారికేని యీ భుజంగత్వముఁ గల్పించుట

యీకవియొక్క గొప్పలోపము. దీనివలననే కృతిపతినింగూర్చి షష్ఠ్యంతములలో "పంచారామవధూటీ పంచాస్త్రవిహారకేలి పాంచాలునకున్" అని వ్రాసెను. ఇది యాకృతిపతికేనిఁ బంచారామవాసులగు పుణ్యాంగనలకేని గౌరవజనకంబుగ మాకుఁదోఁచదు.

24-వ పుట 14-వ పద్యము "అతని నిశ్వాసముల మాత్ర • నానోకావో, వేదములును జరాచర • విశ్వజగము." దీనికి మూలము "భవత్యపాఙ్గమాత్రేణ తస్యసర్వమిదంజగత్."

46-వ పుట 18-వ వచనము. "వేదండవదనశుండాకాండచులికితోన్ముక్తసప్తగోదావరీ సలిలధారాఝణత్కారబృంహిత బ్రహ్మాండగోళంబును" అను దానికిమూలము "సప్తగోదావరతట క్రీడాసక్తస్యశీకరైః । గజాస్యస్య కరోన్ముక్తైః క్లిన్నమార్తాణ్డమణ్డలమ్"

94-వ పుట 153-వ పద్యము "పుండరీకత్వక్ప్ర • కాండాతిమంజిమ, కటిమండలంబు" దీనికి మూలము "పుణ్డరీకోద్భవశిరోమాలికాహారశోభితమ్" ఇందుఁ బుండరీకశబ్దము తక్క దానియర్థము సహితము భిన్నము.

ఇట్లున్నను నొక్కొక్కయెడమూలాతిక్రమణమె రసమును మిక్కిలి పోషించిన ట్లగపడును. సూర్యోదయాదివర్ణనములయందును గృతిపతివంశవర్ణనములందును నీకవి నిజకవితాప్రాగల్భ్యము విపులముగఁ దెలిపియున్నాఁడు. వలయునేని 26-వ పుట 30-వ పద్యము. తే. సంజ కెంపునుదిమిరపుం • జంపునలుపు, గమిచి బ్రహ్మాండ భాండంబు • గరము మెఱసెఁ, బరమపరిపాకదశవృంత • బంధ మెడలి, పతనమగుతాటి పంటితోఁ • బ్రతిఘటించి." యను దీనిం జూడుఁడు. ఇట్టివి కొల్లలుగనున్నయవి. కవన మెచ్చుటనేగాని తడవికొనిన ట్లగపడదు. "ముగుఱంగూర్చిన ముండదైవము నకున్ • మోమోటలేదోసుమీ" యను దానివంటి దేశీయములు మంచినీళ్లప్రాయముగ నీకవి వాడును. వేయేల? హరవిలాసమున "గప్పలు, గఱరవరట్టుగరవఁగర గట్టనియఱచెన్" అని కప్పలకూఁతలను గవిత్వమునఁ జేర్చివ్రాసిన యీ మహాకవి శైలియిట్టిట్టి దనవలయునే?

ఇతనికి శైవపక్షపాతము మెండనుట యీతనిచే రచింపఁబడిన గ్రంథముల వలననెకాక యీ భీమఖండమునందు శ్రీకూర్మము సర్పపురమునుంగూర్చి మూలమున రెండధ్యాయములు మిక్కిలి విపులంబుగస్తుతిపాఠములతోడ వ్రాయఁబడి

యుండ నాంధ్రంబున నీరెండుస్థలములు నొక్కపద్యమున (29-51) నొక్కొక్క పాదమున నతిసంక్షేపముగ వర్ణింపఁబడుటవలనను దెలిసికొననగును.

91. 137 } ముజ్జగంబు
15. 89 }
38. 120 ఎల్లక శిష్యేల
112. 76 సీమటు.

ఇట్టివికొన్ని మృగ్యంబులగు ప్రయోగంబు లీకావ్యంబునఁ గనఁబడినవి. ఆంధ్రలక్షణంబు దెఱంగుంబట్టి యివిలక్షణవిరుద్ధంబులన సాహసింపము. అఖండయతి యీకవికి సమ్మతము.

ఉత్తరభాగమునం దేకారణముచేతనో యీ గ్రంథము మిక్కిలి యజాగ్రత్తతో వ్రాయఁబడిన ట్లగపడుచున్నది. ఎట్లనిన:—

54—62 తీర్థముల పేళ్లును వరుసయుఁ గ్రమంబుగ లేదు.

85 వక్త యెవరయిననియు మఱచి వ్రాయఁబడి యున్నది.

111-వ పుట 66-వ పద్యమున ‘‘అయిదుతరముల పూర్వులనవలమీఁద, నందఱను గాచు నూర్ధ్వలోకాలయముల’’ దీనికిమూలము ‘‘దశపూర్వాన్ దశాపరాన్’’ అనియున్నది. 10-కి 5 వేసినది సహజోక్తికిని విరుద్ధముగనున్నది.

121-వ పుట 157-వ పద్యము ప్రథమపాదమునఁ బాపములు ప్రబలు ననఁబడియె. 2-వ పాదమున పాపక్షయము పేర్కొనఁబడియె. పాపంబులెట్లు ప్రక్షయంబందునో వ్రాయఁబడియుండలేదు. మూలమున నీపట్టున ‘‘సత్సమాగమమన్నామ కథాశ్రవణయోగతః। పాపక్షయోభవేద్దేవి’’ అనియున్నది.

గ్రంథాంతమున యోగవర్ణనముపట్ల మూలాతిక్రమణమును గ్రమభంగమును దండిగఁ గనఁబడు చున్నవి.

ఈ కవి వ్రాసినగ్రంథములలో ‘‘వీథినాటకము’’ అనునదియొకటి పేర్కొనియున్నాము కదా? వీథియనునది దశరూపకములలో నొకటి. శ్రీనాథునకేని యాతని సమకాలికులకేని నాటకములు వ్రాయనేల బుద్ధిపుట్టకపోయెనో యది మిక్కిలి చింత్యము.

ఈకవి భాగవతము నాంధ్రంబున రచియించిన మహాకవియగు బమ్మెరపోతరాజునకు బావమఱంది యందురు. వేంకటగిరిరాజులకు మూలపురుషుఁ డగు చెవి

రెడ్డి మొదలు పదవతరమునఁ బుట్టి రాజ్యమేలిన సర్వజ్ఞసింగమనాయని నతనికి ముందువాఁడైన లింగమనేనిని సందర్శించిన ట్లగపడుటచే నీతనికాలము క్రీస్తు 15-వ శతాబ్దముపూర్వార్ధములోనిది యనవచ్చును. భీమఖండము ప్రథమాశ్వాసము 31-వ వచనమువలన నీకవినిఁ బాలించినరెడ్లయాస్థానము రాజమహేంద్రవరమని యేర్పడుటవలనను నితఁడు తన గ్రంథములనెల్ల రెడ్లకో వారివారికో యంకితమిచ్చియుండుట వలనను నితని నివాసభూమి రాజమహేంద్రవర మనియె చెప్పవలసియున్నది. శ్రీనాథుఁడును బోతనామాత్యుఁడును వేంకటగిరి సర్వజ్ఞసింగమనాయని యాస్థానకవులని యాసంస్థానవంశచరిత్రమున వ్రాయఁబడియున్నదఁటయని బ్రహ్మశ్రీ మహారాజరాజశ్రీ రాయబహదరు కందుకూరి వీరేశలింగము పంతులవారు వ్రాయుచు దానినిఁ దాము విశ్వసింపమని తమకవులచరిత్రములోఁ దెలిపియున్నారు. "ఈ సర్వజ్ఞసింగమనాయఁడు కావ్యనాటకాలంకారములయందును దర్కవ్యాకరణాదిశాస్త్రములయందును సమర్థుఁడై కావ్యములు వ్రాయడమునందుఁ బ్రజ్ఞకలవాఁడై సింగభూపాలీయ మనునలంకారగ్రంథమును జేసెను. ఈయన పరాక్రమశాలియై ప్రౌఢదేవరాయలవారి దినములలోఁ బ్రసిద్ధుఁడుగ నుండెను. శ్రీభాగవతముఁ దెనిఁగించిన బమ్మెరపోతరాజనే కవీశ్వరుఁడీయనమీఁద భోగినీదండకమును జెప్పినాఁడు. నైషధముఁ దెనిఁగించిన శ్రీనాథుఁ డనుకవీశ్వరుఁడుసింగమనాయనిమీఁదఁ గొన్ని పద్యములఁ జెప్పియున్నాఁడు." అనిమాత్రమె యీవంశమువారి వంశవృక్షమునఁ గనంబడుచున్నది. అయినను దీని నాధారముగఁ గొని యింగ్లీషుభాషలో రాజా టి రామరావుగారిచే వ్రాయఁబడిన వంశచరిత్రమందు మాత్ర మిట్లని యున్నది:— "His Court is said to have been adorned by several poets among whom were Bammera Pota Raju who translated the Bhagavatam in Telugu and Sreenathudu the Telugu translator of Naishadam. Sarvagna Singama Nayudu formed the subject of a composition by the former called Bhoginee Dandakam and of some stray verses by the latter." పోతన శ్రీరామచంద్రుని యాస్థానకవియే కాని సామాన్యనరపతుల నాశ్రయించినవాఁడు కాఁడనుట లోకవిదితము. శ్రీనాథుఁడు తన గ్రంథములను రెడ్లకును వారిమంత్రులకును భాండాగారాధ్యక్షులకును నంకితం బొసఁగి లాభ మపేక్షించినవాఁడై యుండఁగ నతఁ డాస్థానకవియైయుండినచో "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనమ్ములున్ | సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే | సమ్మెటపోటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పెనీ | బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ || అని నరాంకితమున కెం

తేనియు విముఖుఁడై కేవల ముదాసీనుఁడైయున్న బమ్మెర పోతనామాత్యుని నెట్లో మెప్పించి భోగినీదండకముం గైకొనిన సరసుఁ డగు సింగభూపాలుఁ డితనివలన నొక గ్రంథమేనియు నంకితము వడసియుండమికిం గారణ మేమియై యుండును! కావున నీవార్తవిశ్వసనీయము కానిదే. అయినను శ్రీనాథునకును సింగభూపాలునకును సమాగమము కలిగినదియు, వారలొకరియం దొకరు మిగుల గౌరవముంచియుండి రనుటయు విదితంబ. ఎట్లనిన శ్రీనాథుఁడు సింగమనాయని కొలువుకూటంబు దరియం బోవునపు డీలాగు సరస్వతిని నుతించెనఁట.—

సీ. దీనారటంకాలఁ • దీర్థమాడించితి - దక్షిణాధీశుము • త్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్ర • భాషామహాకావ్య - నైషధగ్రంథసం • దర్భమునకుఁ
బగులఁగొట్టించి తు • ద్భటవివాదప్రౌఢి - గౌడడిండిమభట్టు • కంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియా • శక్తిరాయలయొద్దఁ - బాదుకొల్పితి సార్వ • భౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను • నింకమీఁద, రావుసింగమహీపాలు • ధీవిశాలు
నిండుకొలువున నెలకొని • యుండి నీవు, సకలసద్గుణనికురుంబ • శారదాంబ.

ఇట్లు నాయనింగారి సన్నిధిం జేరి శ్రీనాథుఁడు,

క. సర్వజ్ఞనామధేయము, శర్వునకే రావుసింగ • జనపాలునకే
యుర్విం జెల్లును నితరుని, సర్వజ్ఞుం డనుట కుక్క • సామజ మనుటే.

యనియెనఁట. అంత నాభూకాంతుఁ డొకసమస్య నొసంగ దాని నిట్లు పూరించెనఁట.

ఉ. తక్కక రావుసింగవసు • ధాధిపుఁ డర్థుల కిచ్చుచున్నచో
దిక్కులలేనికర్ణుని ద • ధీచిని ఖేచరువేల్పుమ్రానుఁ బెం
పెక్కినకామధేనువు శి • బీంద్రుల నెన్నెదు భట్టదిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ • క్రోఁతివొ పిల్లివొ భూతపిల్లివో.

శ్రీనాథుఁడు సింగమనాయనిఁ జూచినపుడు ముదిమివయసున నుండవలయు. ఏలయన నీవంశమున నెనిమిదవపురుషాంతరమున నుండిన కుమార వేదగిరినాయఁడు మాచారెడ్డిని గొట్టి యాకాలపు దురాచారపద్ధతిని దల దనతమ్ముపడిగలోఁ బొదివించెను. మాచారెడ్డి సోదరుఁ డనవేమారెడ్డి యంతటఁ బగఁబూని యాకుమార వేదగిరినోడించి యాతని తలఁ దెగనఱికి దానిం దనతమ్ముపడిగలోఁ బొదివించెను. ఆ వేదగిరితమ్ముఁడు లింగమనాయఁడు సింగమనాయని పైతరమువాఁ డా యన వేమారెడ్డిం జంపి యతని తలను దనతమ్ముపడిగం బొదిగించినదిగాక సందికంతపోతరాజను కఠారిని సైతముఁ గైకొనెను. ఈ కఠారికై శ్రీనాథుఁడు లింగమనీనిం జేరి

సీ. జగనొబ్బగండాంక•సంగ్రామనిశ్శంక - జగతీశరాయవే•శ్యాభుజంగ
యఖిలకోటలగొంగ•యరిరాజమదభంగ - మేలందుధరణీశ•మీనజాల
మూరురాయరగండ•మురియురాజులమిండ - యభివృద్ధిమీఱుచౌ•షష్టిమల్ల
ఘనగాయగోవాళ•కామినీపాంచాల - బ్రహ్మయుశశివంశ•పరశురామ
దండిబిరుదులసురతాని•గుండెదిగుల, భళిరె యల్లయవేముని•పగఱమిండ
రమణమించిన మేదిని•రావుబిరుద, సంగరాటోపమాదయ•లింగభూప.

అనుపద్యమును జదివి దానిని మరలఁ బుచ్చుకొనెను. ఇదియునుఁగాక పైనుదాహరింపఁబడిన "నూనూఁగుమీసాల" యనుపద్యమువలన శ్రీనాథుఁడు కాశీఖండమును రచించినపుడు "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమును" దాఁటియుండెను. ఆకాశీఖండ మల్లాడవీరభద్రారెడ్డి కంకితము. వీరభద్రారెడ్డి వేంకటగిరి సంస్థానము వారిలోఁ దొమ్మిదవ పురుషాంతరమునందున్న లింగమనేని సమకాలికుఁడు. దీనికిఁ బ్రమాణము:—

ఉ. బల్లిదగండలింగవిభు•పాదమునందుఁ బసిండియందె తా
ఘల్లురుఘల్లుఘల్లురని•ఘల్లని మ్రోయఁగ భీతి గుండియల్
ఝల్లురుఝల్లుఝల్లురని•ఝల్లన నల్లలనాడుచుండు రా
యల్లయరెడ్డివేముఁడును•నాతనితమ్ముఁడు వీరభద్రుఁడున్.

ఈకవి సింగమనాయనియొద్దకు రాఁగతము మృగ్యము.

పైనుదువఁబడిన "సర్వజ్ఞ నామధేయము" అనుపద్యమును సింగమనాయని కొలువులో శ్రీనాథుఁడుచదివి మరలినవెనుక రెడ్లవారతని నిచ్చకాలమారియని యాక్షేపించినట్లును దానికతఁడాపద్యమున కన్యార్థము కల్పించినట్లును నొకప్రతీతి బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులవారి కవి జీవితములందుఁ గనఁబడుచున్నది. "దీనారటంకాల" యను పద్యముం జదివినవారును "సింగభూపాలీయ" మనునామాంతరముగల 'రసార్ణవసుధాకరా' ద్యద్గ్రంథకర్తయు రసజ్ఞుఁడును నగుసింగభూపాలునిమహిమ నెఱింగినవారు నీకథ నెంతయు నమ్మరు. 'సర్వజ్ఞ నామధేయము' అని శ్రీనాథుఁడు పొగడినదే నిజమును సలక్షణమును.

ఇంక శ్రీనాథునిఁ బోతనామాత్యునిఁ గూర్చి కొన్ని కథలు కలవు. అవియన్నియుఁ బోతనామాత్యుని పారలౌకిక ధర్మంబును శ్రీనాథుని యైహికభోగేచ్ఛను దెల్పునవి.

ఇంతటి మహాకవి యయ్యును గొప్పవారియాశ్రయముగలిగియుండియు ననేక గ్రంథముల రచించి యనేకుల కంకిత మిచ్చి లాభముఁ బొందియుండియు శ్రీనాథుఁడు తనయందలి గొప్పలోప మగు స్త్రీలౌల్యము వలనఁ గాఁబోలు నవసానదశ యందు మిగుల దారిద్ర్యము ననుభవించినట్టు లీక్రిందిపద్యములు తెల్పుచున్నయవి.

సీ. కవిరాజుకంఠంబుఁ♦గౌఁగిలించెనుగదా - పురవీధినెదురెండఁ♦బొగడదండ
సార్వభౌమునిభుజా♦స్తంభ మెక్కెనుగదా - నగరివాకిటనుండు♦నల్లగుండు
ఆంధ్రనైషధకర్త♦యంఘ్రియుగ్మంబునఁ-దగిలియుండెనుగదా♦నిగళయుగము
వీరభద్రారెడ్డి♦విద్వాంసుముంజేత-వియ్యమందెనుగదా♦వెదురుగొడియ
కృష్ణవేణమ్మ కొనిపోయె♦నింతఫలము, బిలబిలాక్షులుదినిపోయెఁ♦దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి♦మోసపోయి, తెట్లు చెల్లింతుఁ డంకంబు♦లేడునూర్లు.

సీ. కాశికావిశ్వేశుఁ♦గలిసె వీరారెడ్డి - రత్నాంబరంబు లే♦రాయఁడిచ్చుఁ
గైలాసగిరిఁ బండె♦మైలారు విభుఁడేగి-దినవెచ్చ మే రాజు♦తీర్పఁగలఁడు
రంభఁ గూడెఁ దెనుంగు♦రాయరాహుత్తుండు-కస్తూరి కేరాజుఁ♦బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె♦విస్సనమంత్రి మఱిహేమ-పాత్రాన్న మెవ్వని♦పంక్తిఁగలదు
భాస్కరుఁడు మున్నె దేవుని♦పాలికరిగెఁ,గలియుగంబుననిఁక నుండఁ♦గష్టమనుచు
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ♦డమరపురికి, దివిజకవివరుగుండియ♦ల్దిగ్గురనఁగ.

శ్రీరస్తు.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః.

# శ్రీ భీ మే శ్వ ర పు రా ణ ము

## ప్ర థ మా శ్వా స ము.



స్తనగంధసారపరి ♦ షేకసమంచితసాయకప్రయో
గాస్తమహాపురత్రయుఁడ ♦ హార్యధనుర్ధరుఁ డర్కకోటిదీ
ప్తిస్తవనీయవిగ్రహుఁడు ♦ భీమయదేవుఁడు దక్షవాటికా
వాస్తుఁడు ప్రోచుఁగావుత ధ్రు ♦ వంబుగ దేవయయన్నధీమణిన్. 1

### ఇష్టదేవతాప్రార్థనము.

ఉ. ఏనికమోముతో ల్పెలుక ♦ నెక్కినరావుతురాజు సౌరసే
నానియనుంగుఁబెద్దన వి ♦ నాయకదేవుఁడు కర్ణతాళఝం
ఝానిలతాండవంబున ని ♦ రంతరముం బ్రబలాంతరాయసం
తానమహాఘనాఘనక ♦ దంబములం విదళించుఁ గావుతన్. 2

ఉ. బాలికమోము మత్తవన ♦ బర్హికిశోరక లాస్యలీలఁ బై
వాలిచి పచ్చకప్పురపు ♦ వాసనతోడి ముఖారవిందతాం
బూలము మోవి మోవిపయి ♦ మోపుచు రాధకునిచ్చు ధూర్తగో
పాలుఁడు ప్రోచుఁగావుత న ♦ పారకృపామతి మంత్రియన్ననిన్. 3

సీ. రాజీవభవుని గా ♦ రాపుఁబట్టపుదేవి-యంచబాబా నెక్కు ♦ నలరుఁబోణి
పసిఁడికిన్నెరవీణెఁ ♦ బలికించు నెలనాగ-పదునాల్గువిద్యల ♦ పట్టుఁగొమ్మ

---

1. శ్రీస్తన...త్రయుఁడు = విష్ణువునే బాణముగాఁ బ్రయోగించి త్రిపురంబుల నాశనముచేసినవాఁడూ; అహార్యము = పర్వతము, (ఇచటమేరువు). 2. అంతరాయసంతానము = విఘ్నపరంపర; ఘనాఘనము=మేఘము; 3. బాలిక = కన్యక, (ఇచట రాధ).

యీారేడుభువనంబు ♦ లేలుసంపదచేడె-మొలకచందురుఁదాల్పు ♦ ముద్దరాలు
వెలిచాయకొదమరా ♦ చిలుకనెచ్చెలికత్తె-ప్రణవపీఠికనుండు ♦ పద్మగంధి
తే. మందరాచలకందర ♦ మథ్యమాన, దుగ్ధపాథోధిలహరికా ♦ ధూర్తయైన
లలితసాహిత్యసౌహిత్య ♦ లక్ష్మి నొసఁగు, వరదయై మాకు వినతగీర్వాణి వాణి.

## ——ఈ పురాతనకవీంద్రగుణకీర్తనము. ఈ——

శా. శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా ♦ సూత్రించి రామాయణం
బేకైకాక్షర మెల్లపాపముల మా ♦ యింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణసంయమివరుఁ ♦ జూతు న్మనోవీథి వా
ల్మీకిఁ బ్రహ్మపదావతీర్ణకవితా ♦ లీలావతీవల్లభున్.

మ. తలఁతుఁ భారతసంహితాధ్యయనవి ♦ ద్యానిర్మితి ప్రక్రియా
నలినప్రోద్భవునిఁ గళిందతనయాం ♦ తర్వేదిపుణ్యస్థలీ
పులినాభోగకృతావతారు నపరాం ♦ భోజాత్ము నక్షీణని
ర్మలసాహిత్యకళాసమృద్ధికయి పా ♦ రాశర్యమానీశ్వరున్. 6

సీ. ప్రణుతింతు రసభావ ♦ భావనామహనీయ-కవితానముల్లాసుఁ ♦ గాళిదాసు
గణుతింతు నిరవద్య ♦ గద్యపద్యనిబంధ-పరితోషితస్థాణు ♦ భట్టబాణు
భజియింతు సాహిత్య ♦ పదవీమహారాజ్య-భద్రాసనాసీనుఁ ♦ బ్రవరసేను
వర్ణింతు నంభోధి ♦ వార్వీచిగంభీర-తాసారవాక్సము ♦ త్కృష్టహర్షు
తే. భాస శివభద్ర సౌమిల్ల♦భల్లురకును, మాఘ భారవి బిల్హణ♦మల్హణులకు
భట్టి చిత్తవకవి దండి♦పండి తులకుఁ, గీలుకొలుపుదు నొసలిపైఁ♦గేలుదోయి. 7

క. నెట్టుకొని కొలుతు నన్నయ, భట్టోపాధ్యాయసార్వ♦భౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత, ఘట్టోల్లంఘనపటిష్ఠ ♦ గాఢప్రతిభున్. 8

---

4. బాబా = గుజ్జము. ఈరేడు=పదునాలుగు. లలితసాహిత్యసౌహిత్యలక్ష్మి=మనోజ్ఞమైన సాహిత్యముయొక్క సంపూర్ణసంపద. వినతగీర్వాణి = మ్రొక్కుచున్న దేవతాస్త్రీలుగలది. 5. సుశ్లోకుండు= మంచికీర్తిగలవాఁడు. అవతీర్ణ = దిగిన. కవితాలీలావతీ = కవితయనియెడు స్త్రీ. 6. కళిందతనయ= యమునానది. 7. పరితోషితస్థాణు= శివుఁడు ఎవనిచే సంతోషింపఁజేయఁబడినవాఁడాయెనోవాఁడు. తృ-ఝ. వార్వీచి=నీటియలలు.

ఉ. పంచమవేదమై పరఁగు♦భారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు♦విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁడ
క్కాంచనగర్భతుల్యున క ♦ ఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవి ♦ రాజికిఁ దిక్కనసోమయాజికిన్. 9

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ ♦ కాల్పట్టణాధీశ్వరుఁ
ఘనునిఁ బద్మపురాణసంగ్రహకళా ♦ కావ్యప్రబంధాధిపుఁ
వినమత్కాకతిసార్వభౌముఁ గవితా ♦ విద్యాధరుం గొల్తు మా
యనుఁగుందాతఁ బ్రదాతృశ్రీకమలనా ♦ భామాత్యచూడామణిన్. 10

మ. హరచూడాహరిణాంకవక్రతయుఁగా ♦ లాంతస్ఫురచ్చండికా
పరుషోగ్గాఢపయోధరస్ఫుటతటీ ♦ పర్యంతకాఠిన్యముఁ
సరసత్వంబును సంభవించెననఁగా ♦ సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబునటించుచుండుఁ గవిరా ♦ జీగేహరంగంబులన్. 11

## కుకవి నిరాకరణము.

చ. వెస వసుధాస్థలంబునఁ గ ♦ వీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనఃకటాహకుహ ♦ రంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయతూలికం గొని లి ♦ ఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజాననవి ♦ యత్తలతాళపలాశరేఖలన్. 12

తే. బోధమల్పంబు గర్వమ ♦ భ్యున్నతంబు, శాంతినిష్పచ్చరంబు మ ♦ చ్చరము ఘనము
కూపమండూకములఁబోలెఁ♦గొంచె మెఱిఁగి, పండితంమన్యులైన వై♦తండికులకు. 13

తే. నికటమునునుండి శ్రుతిపుట ♦ నిష్ఠురముగ, నడరి కాకులు బిట్టుపె ♦ ద్దఱచినప్పు
డుదధిరాయంచ యూరక♦యుంటలెస్స, సైఁపరాకున్న నెందేనిఁ♦జనుట యొప్పు. 14

---

10. వినమజ్జ్యాంతరసార్వభౌము. అనిపాఠ. వినమత్=నమ్రుఁడైన. 11. హర...వక్రత= శివుని జటాజూటమందుండు చంద్రునివలె వక్రముగలట్టియును. అనఁగాఁ గేవలప్రౌఢకవీశ్వరాంగీకృతమయి సామాన్యకవిజనానవబోధమగు రహస్యములని యర్థము. 12. మషీ=మసి, (సిరా). తాళపలాశ = తాటియాకు. 13. నిష్పచ్చరము = లేమిడి. 13. పండితంమన్యులు = పండితులుగాకుండినను దాముపండితులమని గర్వపడువారు. వైతండికులు = వితండావాదము చేయువారు.

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృత♦భాషయందు, బలుకునుడికారమున నాంధ్ర♦భాషయందు
నెవ్వ రేమన్న నందుగా♦కేలకొలఁది, నాకవిత్వంబు నిజము క♦ర్ణాటభాష. 15

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రగుణకీర్తనంబును గుకవినిరాకరణం
బునుం జేసి యాత్మగతంబున. 16

తే. నవమరుత్తుచరిత్రంబు ♦ నైషధంబు, సప్తశతి పండితారాధ్య ♦ చరితమనఁగఁ
గావ్యములు పెక్కు సెప్పియుఁ♦గాంక్షచనక, వెండియును గావ్య మొక్కటిఁ గా♦వింపఁదలఁచి.

వ. ఉన్నంత. 18



## ఉపోద్ఘాతము.

సీ. ఏమంత్రి కులదైవ ♦ మిందుశేఖరుఁడు ద-క్షారామభీమేశుఁ ♦ డఖిలకర్త
యేమంత్రి యేలిక ♦ యిక్ష్వాకుమాంధాతృ-రామసన్నిభుఁడైన ♦ వేమనృపతి
యేమంత్రి సితకీర్తి ♦ యేడువారాసుల-కడకొండయవులచీఁ ♦ కటికిఁగొంగ
యేమంత్రి సౌభాగ్య ♦ మిగురుఁగైదువజోదు-లాలిత్యలీలకు ♦ మేలుబంతి

తే. యతఁడు కర్ణాట లాట భో♦టాంగ వంగ, కురు కుకురు కుంత లావంతి♦ఘూర్జరాది
నృపసభాస్థానబుధవర్ణ ♦ నీయసుగుణ, మండనుఁడు బెండపూఁడన్న ♦ మంత్రివరుఁడు.

వ. ఒక్కనాఁడు. 20

సీ. భాట్టప్రభాకర ♦ ప్రస్థానసంవేద్యు-లుద్దండపాండిత్యు ♦ లొక్కవంక
ఫణిపభాషితభాష్య ♦ ఫక్కికాభావజ్ఞు-లుత్తమప్రాగల్భ్యు ♦ లొక్కవంకఁ
గణభుజ్మతగ్రంథ ♦ గాఢార్థవిదులబా-హుశ్రుత్యసంపన్ను ♦ లొక్కవంక
వేదాంతవాసనా ♦ విశ్రాంతహృదయజ్ఞు-లుపనిషత్తత్త్వజ్ఞు ♦ లొక్కవంక

తే. నుభయభాషాకవీశ్వరు ♦ లొక్కవంక, వేశ్యలొకవంక నొకవంక ♦ వీరభటులు
బలసి కొలువంగఁ గొలువుండి ♦ పిలువఁబంపె, బెండపూఁడన్నమంత్రీశ్వ♦రుండునన్ను.

గీ. ఇట్లు పిల్పించి సన్మాన ♦ మెసకమెసఁగ, సముచితాసనమున నుంచి ♦ చతురలీల
నానతిచ్చెను రాయవే♦శ్యాభుజంగు, మంత్రి గంభీరధీరసం♦భాషణముల. 22

సీ. వినుపించినాఁడవు ♦ వేమభూపాలున-కఖిలపురాణవి ♦ ద్యాగమములు
కల్పించినాఁడవు ♦ గాఢపాకంబైన-హర్షనైషధకావ్య ♦ మాంధ్రభాష
భాషించినాఁడవు ♦ బహుదేశబుధులతో-విద్యాపరీక్షణ ♦ వేళలందు
వెదచల్లినాఁడవు ♦ విశదకీర్తిస్ఫూర్తి-కర్పూరములుదిశాం ♦ గణములందుఁ

15. నుడికారము=మాటలచమత్కారము. 21. బహుశ్రుత భావము బాహుశ్రుత్యము.

తే. బాకనాటింటివాఁడవు ♦ బాంధవుఁడవు, కమలనాభునిమనుమఁడ ♦ వమలమతివి
నాకుఁగృపసేయు మొకప్రబం♦ధంబు నీవు, కలితగుణగణ్య శ్రీనాథ♦కవివరేణ్య. 23

తే. సప్తసంతానములు నాకు ♦ సంభవించె, నొకప్రబంధంబు వెలితిగా ♦ సుకృతగరిమ
నా వెలితి మాన నా పేర ♦ నంకితముగ, శివపురాణంబు తెనుఁగుగాఁ ♦ జేయుమొకటి. 24

వ. అదియును.

క. బంధుర సపాదలక్ష, గ్రంథంబై యైదుపదులు ♦ ఖండంబులతో
సంధిల్లుస్కాందంబన, సింధువునకుఁ గాల్వలమరి ♦ చినచందమునన్. 25

మ. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగు ద♦క్షారామభీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యముతోడఁ గూడి భువన♦శ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసారమగు శ్రీ♦గోదావరీఖండముం
బరిపాటిం రచియింపు మంధ్రజగతీ♦భాషాప్రబంధంబుగన్. 26

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాంబరాభరణంబులొ
సంగి వీడుకొలిపిన. 27

సీ. ధారాసురత్రాణ ♦ ధాటీసమారంభ-గర్వపాథోరాశి ♦ కలశజులకు
సప్తమాడియరాజ♦ఝాడియత్నాపాల-వందితశ్రీపాద♦వనరుహులకు
సింహాద్రిపర్యంత♦సీమాంధ్రమేదినీ-మండలీ పాలనా♦ఖండలురకు
హరిదంతదంతిదం♦తావళీలిఖ్యమా-నానేకజయశాస♦నాక్షరులకు

తే. వీరభద్రేశ వేమపృ♦థ్వీధవులకు, ననుఁగుమంత్రి మహాప్రధా♦నాగ్రగణ్యు
బెండపూఁడన్న జగనొబ్బ♦గండబిరుద, సచివదేవేంద్రుఁ గృతికధీ♦శ్వరునిఁజేసి. 28

వ. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితంబులను పంచలక్షణంబులతోడంగూడి సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండమండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీమహాస్కాందంబను నాదిపురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దక్షారామభీమేశ్వరమాహాత్మ్యసంయుతంబగుటంజేసి భీమేశ్వరపురాణంబనంబరఁగు; నది యాంధ్రభాషాప్రబంధంబుగఁ జెప్పందొడంగితి; నమ్మహాప్రారంభంబునకు మంగళాలంకారంబుగా నమ్మహామంత్రీశ్వరునేలిన వీరభద్రేశ్వర వేమభూపాలుర వంశావతారం బభివర్ణించెద. 29

## వేమభూపాలుని వంశావతారవర్ణనము.

ఉ. కైటభదైత్యవైరిపద ♦ కంజమునం దుదయంబునొందె మి
న్నేటికి భూతధాత్రికిని ♦ నెంతయు నచ్చిన తోడఁబుట్టువై

హాటకగర్భముఖ్యనిఖి ♦ లామరమౌళిమహామణిప్రభా
పాటలవర్ణమైన యొక ♦ పావనవర్ణ ముదీర్ణసంపదన్. 30

వ. అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసిచరణపల్లవంబు దనకుఁ బుట్టినిల్లుగావునఁ గారణగుణసంక్రమంబునం బోలెఁ జామరతోమరచ్ఛత్రధనుఃఖడ్గాదిచిహ్నోపశోభితంబై, చదలేటినీటివలని సోదరీయస్నేహలబ్ధంబులుం బోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యంబులు చరితమనస్స్వభావవచనంబుల ధరియించి సైదోడుం బోడివి విశ్వవిశ్వంభరాక్రీడనంబు దనకువిదిర్చిన పరమశ్లాంతి యంతరంగంబున సంతరించి నిఖిలప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందుఁ బద్మనాయకులనుం వెలమలనఁ గమ్మలన నరిసర్లన వంటర్లన బహుప్రకారశాఖోపశాఖాభిన్నంబులైన మార్గంబులం ద్రిమార్గగంగాప్రవాహంబులుం బోలె గోత్రంబు లెన్నియేనియు జగత్పవిత్రంబులై ప్రవహింపుచుండఁ గల్పంబులతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు సరికడచి వత్సరంబులుచని కాలచక్రంబులతిక్రమించుచుండఁ జతుర్థకులమాళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబైన పంటమహాన్వయంబు బాకనాటిదేశంబ్బున భద్రపీఠంబునధివసించి సింహవిక్రమనగర దువ్వూరు గండవరాళి పట్టణంబులు నిజనివాసంబులుగా భ్రూలతాదష్టాష్టాదశద్వీపాంతరాళులగు భూపాలగ్రామణులఁ ద్రిలింగభూమండలాఖండలురను బోలయవేమాన్నపోతాన్నవేమకుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులంగాంచె. తత్సంబంధబాంధవంబున వసుంధరాభారధౌరంధర్యంబునం గంధసింధురఘటాకూటకపటకిటి కచ్ఛపావతారనారాయణ భుజంగ భూధరంబులకుఁ దోడుజోడై రాయగురుపర్థమేశ్వర సాధుజనవిధేయ ఖోడెరాయ సకలకళాధామాదిబిరుదభాస్వరుండై భీమయగురువరేణ్య పుణ్యకారుణ్యకటాక్షవీక్షాలబ్ధసుస్థిరైశ్వర్యధుర్యుండై విజయధాటీసమాటీకనంబులదిశల్లల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రిపర్యంతంబుత్కళ కళింగ యవన కర్ణాట లాటాంతర్దీపంబైన ప్రతాపంబున దిలీప నల నహుష నాభాగ భరత భగీరథ మాంధాతృ దుందుమార పూరు పురూరవఃప్రభావుండై విశ్వవిశ్వంభరాభువనమండలంబుఁ బరిపాలించెఁ దదనంతరంబ. 31

గీ. రాజరఘురాముల్లాడ ♦ రమణసుతులు; ధాత్రిఁ బాలింతు రాచంద్ర ♦ తారకముగ
వేమభూవల్లభుండును ♦ వీరవిభుఁడు, నన్నదమ్ములు హరియును ♦ సూరుఁడుఁబోలె,32

ఉ. తమ్ముని వీరభద్రవసు ♦ ధాధిపు విక్రమవీరభద్రుని
న్సమ్మదలీల రాజ్యభర ♦ ణస్థితిఁ బట్టముఁగట్టి బాహుద

ర్వమ్మున వేమభూవరుఁడు ♦ వ్రాసె జగద్విజయప్రశస్తివ
ర్ణమ్ములు దిగ్ధురంధర సు ♦ రద్విపకుంభవిషాణమండలిన్. 33

సీ. పాతాళభువనాధి♦పతికి శేషాహికిఁ – బ్రియలతోఁ మనకానఁ ♦ బెనఁగఁగలిగె
దిక్సింధురములకు ♦ దివ్యవాహినిలోనఁ – దేఁట్రి రాయిడి మానఁ ♦ దేలనొదవె
నుర్వీధరములకు ♦ నుదధిలోఁ గాఁపున్న – కులముసాములయిండ్లఁ ♦ గుడువఁబ్బెఁ
గుహనాకిటికి లక్ష్మి ♦ కుచకుంభములమీఁది – కుంకుమంబున నుసుల్ ♦ కొనఁగఁగూడె
తే. రాయవేశ్యాభుజంగవీ ♦ రప్రతాప, భాసి యల్లాడవిభువీర ♦ భద్రనృపతి
సర్వసర్వంసహాచక్ర♦సర్వభరము, పృథుభుజాపీఠమున సంభ♦రించుటయును. 34

క. ఏరీ ధరణిపు లల్లయ, వీరక్ష్మాపతికి సాటి ♦ వితరణగరిమన్
ధారాధరధారాధర, ధారాధరవాహదాన ♦ ధారానిధికిన్. 35

మహాస్రగ్ధర. ఫణిరాజస్తబ్ధరోమ ♦ ప్రకటకమఠరా ♦ ట్పర్వతశ్రేణిదిగ్వా
రణధౌరంధర్యధారా ♦ రభటినమధిక ♦ ప్రౌఢబాహాప్రతాప
ప్రణతప్రత్యర్థిపృథ్వీ ♦ పతిమకుటమణీ ♦ భాసమానాంఘ్రిపీఠున్
బ్రణుతింతున్ వీరభద్రుం ♦ బ్రతిభటధరణీ ♦ పాలకాలాగ్నిరుద్రున్. 36

సీ. పండువాసురతాణి♦పావడం బిచ్చిన – భద్రదేభములు వీధిఁ ♦ బాలెముండు
నొడ్డె ధాత్రీనాథుఁ ♦ డుపదపుత్తెంచిన – బింబారుణోష్ఠినం ♦ బెళవహించుఁ
గర్ణాటభూపతి ♦ కానుక యనిచిన – ముక్తాతపత్రంబు ♦ మ్రోలమెఱయు
యవనాధిపతి యుపా ♦ యనముగా నొసఁగిన – హాగాహయంబులు ♦ వాగెవచ్చు
తే. దూరమంతంతబారుహ ♦ దొంతిమన్నె, సప్తమాడియరాజన్య ♦ సమితిమ్రొక్కు
రాయవేశ్యాభుజంగసం ♦ గ్రామపార్థ, గాయగోవాళవేమన ♦ క్ష్మాధవునకు. 37

శా. దేవబ్రాహ్మణభక్తివర్ధితధరి ♦ శ్రీచక్రసామ్రాజ్యల
క్ష్మీవాస్తోష్పతి సంస్తుతింపఁగఁదగున్ ♦ శ్రీవేమపృథ్వీశ్వరున్
లావణ్యాపరమత్స్యలాం ఛనుని నా ♦ లంకాపురీశంకర
గ్రావాభ్యంతరకూలముద్వహయశః ♦ కల్లోలినీవల్లభున్. 38

క. కాంచీ శ్రీగిరి కాశీ, పంచారామాది దేవ ♦ భవనంబుల వ్రా
యించెను వేమక్ష్మాపతి, యంచితభూదానశాస ♦ నాక్షరపంక్తుల్. 39

37. పండువాసురతాణి = పండువాదేశపురాజు ; పావడము = కానుక; ఉపద= కానుక ; సంబెళ = వక్కలాకులతిత్తి ; ఉపాయనము = కానుక.

సీ. ధరియింప నేర్చిరి ♦ దర్భ వెట్టెడు వ్రేళ్ల - లీలమాణిక్యాంగు ♦ ళీయకములు
కల్పింప నేర్చిరి ♦ గంగమట్టియ మీఁదఁ-గస్తూరికాపుండ్ర ♦ కములు నొసల
సవరింప నేర్చిరి ♦ జన్నిదంబుల మ్రోలఁ - దారహారములు ము ♦ త్యాలసరులు
చేర్పంగ నేర్చిరి ♦ శిఖల నెన్నడుములఁ - గమ్మని క్రొత్తచెం ♦ గల్వవిరులు
తే. ధామముల వెండియును బైఁడి ♦ దడఁబడంగ, బ్రాహ్మణోత్తము లగ్రహా ♦ రముల లోన
వేమభూపాలుఁ డనుజన్ము ♦ వీరభద్రుఁ, ధాత్రి యేలింప గౌతమీ ♦ తటమునందు. 40

తే. ధర్మశాసనఘనశిలా ♦ స్తంభ మెత్తె, శ్రీముకుందోద్భవస్వామి ♦ శివుని మ్రోల
వీరభద్రేశుఁడాచంద్ర ♦ తారకముగ, నగ్రహారాళి నఖిలమా ♦ న్యంబులొనఁగి. 41

సీ. కమలాచలాగ్రమా ♦ ర్కండేయశివశిర - శ్శశిచంద్రికాధౌత ♦ సౌధవీధి
గోదావరీపుణ్య ♦ కూలంకషాజల - స్ఫారితశ్రీరుద్ర ♦ పాదయుగళి
బలవదభ్యున్నత ♦ ప్రాకారపరివేష - గండూషితాజాం ♦ డమండలంబు
గంధదంతావళ ♦ గ్రైవేయఘంటికా - ఠంకారముఖరఘం ♦ టాపథంబు
తే. రాజబింబాననానూత్న ♦ రత్నపేటి, వీరరాహుత్తసుభటకం ♦ ఠీరవాద్రి
వేమభూపాలరాజ్యాబ్ధి ♦ వృద్ధికరము, సాంద్రవిభవంబు రాజమ ♦ హేంద్రవరము. 42

తే. వీరభద్రేశ వేమపృ ♦ థ్వీధవులకు, మంత్రియగు బెండపూఁడన్న ♦ మంత్రివరుని
విమలవంశావతారంబు ♦ విస్తరింతు, నభ్యుదయహేతువుగఁ బ్రబం ♦ ధాదియందు.

## కృతినాయకుని వంశావతారవర్ణనము.

సీ. ఆకాశలక్ష్మికి ♦ నవతంసకంబైన - మునిమండలములోని ♦ మొదలిచుక్క
యఖిలాండ బ్రహ్మాండ ♦ మప్పళించిన యట్టి - చిన్నివేల్పులరాజుఁ ♦ గన్నతండ్రి
యాదికల్పంబునాఁ ♦ డఖిలప్రపంచంబు - సృజియించు బ్రహ్మకుఁ ♦ జేయిదోడు
పరశురామునిచేతఁ ♦ బాథోధిమేఖలా - భరము దానముఁగొన్న ♦ బ్రాహ్మణుండు
తే. పేరు దక్షప్రజాపతి ♦ పెండ్లికొడుకు, కశ్యపబ్రహ్మ నిజవంశ ♦ కర్తగాఁగ
వెలసె నుభయాన్వయంబులు ♦ వృద్ధిఁబొంద, బ్రాలుఁబ్రాలును గలమంత్రి ♦ పోలమంత్రి.

క. సాటి చదలేటినీటికి, హాటకగర్భనివఘాటి ♦ కమరద్రువనీ
వాటికి మధుకైటభరిపు, వీటికి శ్రీపోలమంత్రి ♦ విశదయశంబుల్. 45

క. ఆమంత్రికినుదయించిరి, శ్రీమంతులు కార్యఖడ్గ ♦ జితవైరిమహా
సామంతులు శ్రీయల్లా, డామాత్యగ్రామణియును ♦ నన్నవిభుండున్. 46

45. మధుకైటభరిపువీడు=విష్ణునివాసస్థానమగు శ్వేతద్వీపము.

క. అల్లాడవిభుఁడురిపుహృ, ద్భల్లాడంబరుఁడు వాఁడు ♦ భామలమనసుల్
గొల్లాడఁగ మదనుఁడు దిశ, లల్లాడఁగఁజేయుఁ దద్భు ♦ జాటోపంబుల్. 47

సీ. కాకతిక్ష్మాపాల ♦ గంధదంతావళీ - ధ్వజినీమహాధురం ♦ ధరుఁడనంగ
నవలక్షకోదండ ♦ నాథరాజ్యాంభోధి - సంపూర్ణ పూర్ణిమా ♦ చంద్రుఁడనఁగ
నంధ్రభూమండలా ♦ ధ్యక్షసింహాసన - సంప్రతిష్ఠాపనా ♦ చార్యుఁడనఁగ
వీరరుద్రాశేష ♦ విశ్వంభరాధీశ - పృథులదక్షిణభుజా ♦ పీఠమనఁగ
తే. యవనసంహారవిలయకా ♦ లాగ్నియనఁగ, ధాటివిఘటితకుస్మృతో ♦ ద్యానుఁడనఁగ
విశ్వలోకప్రశస్తుఁడై ♦ వినుతికెక్కె, నతులబలసీరి పోలయ ♦ యన్నశౌరి. 48

చ. కొలనుఁ బ్రతాపరుద్రనృప ♦ కుంజరుచేత నరేంద్రసారణీ
సలిలవివర్ధమానబహు ♦ సస్యసమాకులమగ్రహారమై
వెలయ విభాకరగ్రహణ ♦ వేళఁ దగంగఁ బరిగ్రహించిబం
ధులభరియించె నన్నవిభు ♦ తోసరియెట్లు ప్రధానులెవ్వరున్. 49

శా. అయ్యన్నయ్యకు యావదర్థ పదగ ♦ ర్వానర్వాగంభీరవాక్
శయ్యన్కైటభవైరిశయ్యకు ఘనుల్ ♦ షాడ్గుణ్యవిద్యానిధుల్
త్రయ్యంతజ్ఞులు దేవధీమణియునున్ ♦ దల్లప్రభుండున్ సుతుల్
వియ్యంబందుఁ దదీయకీర్తులు దిశా ♦ వేదండతుండాళితోన్. 50

శా. లక్ష్మీదేవిఁ బయోరుహేక్షణునిఁ బో ♦ ల్పం బాత్రులై యొప్ప శ్రీ
లక్ష్మీదేవికి నన్నమంత్రికి సుతుల్ ♦ లావణ్యసంపన్నిధుల్
లక్ష్మీవంతులు దేవమంత్రియును ద ♦ ల్లప్రప్రధానుండు స
ర్వక్ష్మాధీశసభాంతరస్తుతనయ ♦ ప్రాగల్భ్యవాచస్పతుల్. 51

క. పన్నీటగంధజలమున, నన్నయతల్లప్రధానుఁ ♦ డభిషేకింపన్
గన్నప పుక్కిటినీటను, గన్న యరోచికము వాయుఁ ♦ గఱకంఠునకున్. 52

సీ. ముక్కంటిదరహాస ♦ మున కనుప్రాసంబు - మిన్నేటినీటికి ♦ మిక్కుటంబు
శారదజ్యోత్స్నప్ర ♦ సాదంబునకువీప్స - నలువశుద్ధాంతంబు ♦ నకనుభాష
కల్పకారామరే ♦ ఖకుఁ బ్రతిచ్ఛందంబు - త్రిదశేంద్రుకరటికా ♦ మ్రేడితంబు
పుండరీకారణ్య ♦ మునకునధ్యాహార - మమృతాంబునిధి కభి ♦ ధాంతరంబు

49. కైటభవైరిశయ్య=శేషుఁడు ; త్రయ్యంతము=వేదాంతము. 53. వీప్స=పరంపర గావ్యాపింపనిచ్ఛ; పాణింధమంబు=కొలిమితిత్తి. త్రిదశేంద్రుకరటి=ఐరావతము.

తే. గంధసారతుషారసా ♦ ణింధమంబు, దానవిద్యావిలాసవి ♦ ద్యాధరుండు
మంత్రియన్నయదేవయ్య ♦ మహితయశము, నిఖిలదిక్తటమంతయు ♦ నిండియుండె.

మహాస్రగ్ధర. వియదాశా భూతధాత్రీ ♦ విఖ్యాతికలనని ♦ ర్విఘ్నసంభారనిఘ్నా
వ్యయకీర్తిస్ఫూర్తిముద్రా ♦ హసితశశికిరీ ♦ టాట్టహాస స్వయంభూ
దయితా మందార చంద్రా ♦ తప సురతటినీ ♦ తార నీహారతో న
న్నయదేవామాత్యుతోడన్ ♦ హరహర సరియే ♦ యన్యభూపాలమంత్రుల్. 54

ఉ. ధీరుఁడు దేవమంత్రి నయ ♦ ధీగుణనిర్జితదేవమంత్రి శ్రీ
వీరయదేవవల్లభ్యధిప ♦ విశ్వగతిప్రియపుత్రి రామమాం
బారమణీమణిన్ భువన ♦ పావనవర్తనఁ బెండ్లియాడె నం
భోరుహనేత్రుఁ డంబునిధి ♦ పుత్రికఁ బెండిలియాడుకైవడిన్. 55

సీ. జగదేకసంస్తుత్య ♦ సౌభాగ్యసంపద - రతిదేవిఁబోలునీ ♦ రాజవదన
పరమపాతివ్రత్య ♦ భాగ్యగౌరవమున - భూపుత్రిఁబోలునీ ♦ పువ్వుఁబోఁణి
యక్షీణమహిమఁగ ♦ ల్యాణవైభవమునఁ - బార్వతిఁబోలునీ ♦ పద్మగంధి
మృదుగభీరప్రౌఢ ♦ మితభాషణంబుల - భారతిఁబోలు నీ ♦ పరమసాధ్వి
తే. యనుచు బంధులు వినుతింప ♦ నవనిమించె, నధికశుభగాత్రి విశ్వనా ♦ యకునిపుత్రి
యన్నవిభుదేవమంత్రి ♦ యర్ధాంగలక్ష్మి, రమ్యసద్గుణనికురుంబ ♦ రామమాంబ. 56

తే. సింధుకరి కాళ భల్లాణ ♦ సేనయాది, పరమమాహేశ్వరాచార ♦ పరులసరణి
నన్నవిభుదేవయామాత్యు ♦ నెన్నవచ్చుఁ, బార్వతీవల్లభునిమీఁది ♦ భక్తిగరిమ. 57

శా. ఆరామాంబకు దేవమంత్రికిని ద ♦ క్షారామభీమేశ్వర
స్ఫారాపారకృపాగుణోదయమునం ♦ జన్మించి రాత్మోద్భవుల్
ధీరోదాత్తుఁడు లింగమంత్రి విభుఁడున్ ♦ ధీశాలి తల్లన్నయున్
బారావారగభీరుఁ డన్నధరణీ ♦ పాలుండు లక్ష్మీనిధుల్. 58

ఉ. సంగరసవ్యసాచికిఁ బ్ర ♦ శస్తవితీర్ణిదధీచికి న్మహా
మంగళచారుమూర్తికి స ♦ మంచితనిర్మలధర్మమూర్తికిన్
లింగనమంత్రికిన్ విశద ♦ నీతిధురావిబుధేంద్రమంత్రి క
త్తుంగతరప్రతాపగుణ ♦ ధూర్జటి కెవ్వరుసాటి ధారుణిన్. 59

సీ. ఖండశర్కర జున్ను ♦ కండచక్కెరలు దో - సెలువడల్సేవెపా ♦ సెములతోడఁ
గమ్మఁగాఁ గాఁచిన ♦ కఱియాలనేతితోఁ - గమనీయపంచభ ♦ క్ష్యములతోడ

సంబారములతోడి ♦ శాకపాకములతోఁ - బక్వమైన పెసర ♦ పప్పుతోడఁ
దేనియధారతోఁ ♦ బానకంబులతోడ - శిఖరపాడబరస ♦ శ్రేణితోడ
తే. నచ్చలవణాదికములతోడ ♦ నమృతఖండ, పాండరంబైన దధితోడ ♦ బ్రాహ్మణులకు
భోజనము వెట్టు ద్వాదశీ ♦ పుణ్యవేళ, లింగమంత్రి నవీనరు ♦ క్మాంగదుండు. 60

క. ప్రతిఘటియింపఁగ వచ్చునె, ప్రతిభటులకు ననమసమర ♦ ఫల్గునుతోడన్
శతకోటిస్పృధకర్తారు, క్షతశాత్రవుతోడ లింగ ♦ సచివునితోడన్. 61

సీ. ఝూడేశవనపప్త ♦ మాడెబారుహదొంతి - వంతునాదిక్షితీ ♦ శ్వరులఁ గెలిచి
యొడ్డాదిమత్స్యవం ♦ శోద్భయార్జును చేతఁ - బల్లవాధిపు చేతఁ ♦ బలచమంది
దండకారణ్యమే ♦ ధ్యపుళిందరాజరం - భాహివంశజులకు ♦ నభయ మొసఁగి
భానుమత్కులవీర ♦ భద్రాన్న దేవేంద్ర - గర్వసంరంభంబుఁ ♦ గట్టిపెట్టి
తే. యవనకర్ణాటకటకభూ ♦ ధవులతోడ, బలిమివాటించియేలించెఁ ♦ దెలుఁగుభూమిఁ
దననిజస్వామి నల్లాడ ♦ ధరణినాథు, భళిరె యరియేటిలింగన ♦ ప్రభువరుండు. 62

క. దేవబ్రాహ్మణభూములు, భూవరునకుఁ జెప్పి ధార ♦ వోయించె భళీ
దేవయలింగన ప్రియసం, భావననిరుపాధి సర్వ ♦ మాన్యంబులుగన్. 63

చ. అవుర! ప్రతాపవేమవసు ♦ ధాధిపుచే నృపపట్టభద్రుచే
భువనమనోహరంబయిన ♦ బోడసకుర్తి మహాస్థలంబునన్
దివిరి పరిగ్రహించె మన ♦ దేవయలింగనమంత్రియన్న చో
డవరమహాగ్రహారముఁ గ ♦ డంకఁ గవిద్విజబంధురక్షకై. 64

సీ. వాహ్యాళిభూమిరే ♦ వంతనైషధు లట్లు - హయరత్నముల నెక్కి ♦ యాడనేర్చుఁ
గవిబుధశ్రేణికిఁ ♦ జెవులుపండువులుగా - నాస్థానమున మాట ♦ లాడనేర్చు
శక్తిత్రయంబునఁ ♦ జతురుపాయంబుల - షాడ్గుణ్యముల బుద్ధిఁ ♦ జరుపనేర్చుఁ
గైసేసిప్రత్యక్ష ♦ కందర్పమూర్తియై - నిర్వికారంబున ♦ నిలువనేర్చు
తే. నిష్ఠురాటోపవిస్ఫూర్తి ♦ నృహరి కరణి, నతికఠోర కుఠార ధా ♦ రాంచలమున
వైరివక్షస్స్థలమ్ము వ్రచ్చి ♦ వైవనేర్చు, సంగరార్జునుఁడరి యేటి ♦ లింగవిభుఁడు. 65

ఆ-వె. లింగమంత్రిభామ ♦ గంగాంబికాదేవి, గనియె సుతుల నర్థి ♦ కల్పతరుల
భవ్యరూపపంచ ♦ బాణావతారుల, మంత్రిమంత్రి దేవ ♦ మంత్రివరుల. 66

---

60. శిఖర=పండినదానిమ్మగింజలు; పాడబ=మధురమైన; రస = సారము. 62. పలచము=కష్టము. 65. వాహ్యాళి = స్వారి.

తే. కశ్యపాన్వయపాథోధి ♦ కల్పశాఖి, సర్వగుణరత్నరోహణ ♦ క్ష్మాధరేంద్ర
మభ్యుదయమందు మల్లిరెడ్డి♦గయ్యసుతుఁడు, మదనగోపాల సన్నిభ♦మంత్రిమూర్తి.

ఉ. చంచలలోచనాకుసుమ ♦ చాపుఁడు దానకళాదధీచి యా
శాంచలవారణేంద్రదళ ♦ నాంకురనిర్మలకీర్తి వైభవా
భ్యంచితసర్వలోకుఁ డన ♦ పాయరమావిభవప్రపంచ రా
త్రించరశాత్రవుండు మన ♦ దేవయతల్లన మంత్రిమాత్రుఁడే. 68

క. ఈవసుధామండలమున, నేవారునుసరియె రూప ♦ హేలానుకృత
శ్రీవత్సలాంఛనునకును, దేవయతల్లనికిమంత్రి ♦ దేవేంద్రునకున్. 69

క. నాళీకభవవధూస్తన, పాళీకల్హారరమ్య ♦ పరిమళలహరీ
శాలీనతావిధాయివ, చోళీలలు తల్లనార్థి ♦ సురభికి నమరున్. 70

తే. తదనుసంభవుఁ డఖిలవి ♦ ద్యావిరించి, యర్థిజనకామధుగ్ధేను ♦ వన్నమంత్రి
క్రీడసల్పునే వానిస ♦ త్కీర్తికాంత, సప్తలోకమహోత్సవ ♦ సౌధవీధి.

మ. అరబీభాష తురుష్కభాష గజక ♦ ర్ణాటాంధ్రగాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభా ♦ షా సింధుసౌవీరబ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం ♦ భాషావిశేషంబుల
చ్చెరువై వచ్చు నరేటియన్ననికి గో ♦ ష్ఠీసంప్రయోగంబులన్. 72

ఉ. అన్నయమంత్రిశేఖరుఁడ ♦ హమ్మదుశాసనదానభూమిభృ
త్సన్నిధికెన్నదిన్నముచి ♦ తంబుగ వేమమహీసురేంద్రరా
జోన్నతి సంతతాభ్యుదయ – మొందఁగఁ బారసిభాష వ్రాసినం
గన్నులపండువై యమరుఁ ♦ గాకితమందలి వర్ణపద్ధతుల్. 73

సీ. రాజమహేంద్రదు ♦ ర్గమునఁ గావించె శ్రీ–వీరభద్రునకుఁ బ్రా ♦ కారరేఖ
నిలిపె మార్కండేయ ♦ నీలకంఠుని మ్రోల–రామేశుఁదమతల్లి ♦ నామకముగ
సంగమేశ్వరదివ్య ♦ శంభులింగమునకుఁ–గల్పించెఁ గళ్యాణ ♦ గర్భగృహము
దక్షవాటికయందుఁ ♦ దరుణేందుమాళికి–మొగలివాకిటధామ ♦ మునురచించెఁ
తే. బ్రాగ్దిశావప్రగోపుర ♦ ప్రాంగణమున, సప్తమునిసింధుసోపాన ♦ సరణికెలనఁ
దీర్చెభవనంబుభీమయ ♦ దేవునగర, మంత్రిదేవయయన్నయా ♦ మాత్యవరుఁడు.

---

70. నాళీకభవవధూ = సరస్వతి.

ఉ. భావనసంతసిల్లఁగవి ♦ భావనజాప్తుని విద్విషత్పరీ
భావనవీనశౌరిఁ బ్రవి ♦ భావనుని న్నిఖిలక్షమాజనుల్
దీవనలిచ్చి యెప్పుడు సు ♦ ధీవనరాశి నుతింతు రుత్తముల్
దేవనమంత్రియన్నవిభు ♦ దేవనదీవనపావనాన్వయున్. 75

క. సిరియేలికయగు నదకే, సరి యేమోకాని గర్వ ♦ సంరంభమునై
సరి యేపానరఁగ నితరులు, సరియే యరియేటియన్న ♦ సచివాగ్రణికిన్. 76

శా. కాంచీకంకణతారహారకటక ♦ గ్రైవేయభూషావళుల్
లంచంబిత్తురు ఘూతికాతతికి లీ ♦ లన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపమఁ దారతార కవయన్ ♦ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్లెలఁబురిం ♦ బ్రౌఢేందుబింబాననల్. 77

తే. తారగిరిమందరముల బ్రం ♦ దారకాది, తారకారాజవదనలు ♦ తారుతార
తారధారా శ్రుతి స్వరో ♦ దారలీలఁ, బాడుదురు బెండపూఁడన్న ♦ భవ్యకీర్తి. 78

సీ. కలకంఠములఛాయఁ ♦ గల కంఠకోణంబు-నాగకుండలముల ♦ నాగరికతఁ
జూడఁజూడఁగనొప్పు ♦ సురసరిత్పూరంబుఁ-గాలఁగాలవిభాళి ♦ కటకముద్ర
మేన మేనాత్మజా ♦ మానినీరత్నంబుఁ-గేలికురంగంబుఁ ♦ గేలి వ్రేల
భస్మోపవాహంబుఁ ♦ బాండుదేహంబునఁ-గటినిబుట్టంబైన ♦ కటికితోలు
తే. వికటశృంగారమున నొప్పు ♦ వేల్పు తేని, నాగమోపనిషన్మనో ♦ హరుని హరుని
కర్చనముసేయు సంధ్యాత్ర ♦ యంబులందు, బెండపూఁడన్నకన్నుల ♦ పండువుగను.

సీ. అఖిలదిగ్దంతిదం ♦ తార్గళంబుల వ్రాయు-నధిపుదిగ్జయశాస ♦ నాక్షరములఁ
గువలయాక్షుల మించు ♦ గుబ్బచన్నుల వ్రాయుఁ-గుంకుమపత్రభం ♦ గాంకురముల
గర్వితారాతివ ♦ క్షస్థలంబుల వ్రాయు-నయకార్యసరణికి ♦ ణాంకములను
నర్థిసందోహఘా ♦ లాంచలంబుల వ్రాయు-లక్ష్మీప్రదములైన ♦ లక్షణములఁ
తే. బసిఁడిగంటాన భూపాలు ♦ పార్శ్వసీమ, వ్రాయు నయకావ్యసరణి కే ♦ వలము కాదు
వేమధాత్రీకళత్రు గా ♦ రాము మంత్రి, యతులగుణహారి బెండపూఁ ♦ డన్నశౌరి.

---

75 దేవనదీ=గంగ. వనము=జలము. 79, చూడన్ = శిరస్సునందు. 80 నయకార్యసరణికిణాంకములు=నీతికార్యమార్గరూపములగు కాయలచిన్నెలు.

## షష్ఠ్యంతములు.

క. ఇట్టి మహిమంబు గల జగ, జెట్టికి నర్థార్థిలోక ♦ చింతామణికా
రట్టహయఘట్టసేనా, ఘట్టితరిపుపట్టణోప ♦ కంఠక్షితికిన్. 81

క. కంఠీరవవిక్రమునకు, కుంతప్రతిభునకు దాన ♦ గుణసురభికి శ్రీ
కంఠాంఘ్రి కమలనయనా, త్కంఠావైకుంఠునకు న ♦ ఖండితధృతికిన్. 82

క. దుగ్ధపయోధిసుధారస, ముగ్ధేందుధరాట్టహాస ♦ మురహరశయ్యా
దిగ్ధూర్జరకరటిఘటా, స్నిగ్ధయశోదిగ్ధరోద ♦ సీకుహరునకున్. 83

క. చెంచుమలమారకారున, కంచితబాహాపరాక్ర ♦ మాధారునకున్
పంచారామ వధూటీ, పంచాస్త్రవిహారకేలి ♦ పాంచాలునకున్. 84

క. శ్రీవీరభద్రవేమ, క్ష్మావరరాజ్యాభివృద్ధి ♦ కారణ మునకున్
లావణ్యరూపసంపదఁ, బూవిలుకానికిని బెండ ♦ పూఁడన్ననికిన్. 85

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ గథానాయకుండైన భీమేశ్వర మహాదేవునకుఁ బ్రియధామంబైన దక్షారామపురవరం బెట్టిదనిన. 86

## దక్షారామపురవర్ణనము.

సీ. పర్యంత మందార ♦ పారిజాతకవనీ - రమమాణనిర్ఝరీ ♦ సముదయంబు
సరసరీసాసిద్ధ ♦ వరవారి సంపూర్ణ - గంభీరతరపరి ♦ ఖాపయోధి
ప్రబలచింతారత్న ♦ పాషాణసంఘాత - వప్రరేఖాచక్ర ♦ వలయితంబుఁ
గామధేనుసహస్ర ♦ కఠినరింఖాటంక - దళనదంతురితర ♦ థ్యాముఖంబు
తే. భద్రపాతాళభైరవ ♦ పాలితంబు, గుహవినాయకరక్షణా ♦ కుంఠితంబు
సప్తమాతృకపరివార ♦ సంకులంబు, వసుమతీనూపురము దక్ష ♦ వాటిపురము. 87

సీ. కాంతిసంపద నేల ♦ కైవార మొనరింప - విధుబింబమున నుద్భ♦వించిరనిన
మాధుర్యగుణమేల ♦ మాటిమాటికిఁ జెప్ప - నమృతాబ్ధి నవతార ♦ మంధిరనినఁ
దేజోవిశేషంబు ♦ తెలుఁగు పల్కఁగనేల - విద్యుల్లతలలోన ♦ వెడలి రనిన
మోహనాకృతియేల ♦ మునుమాడి కొనియాడఁ - బుష్పచాపునివింటఁ ♦ బుట్టిరనిన

83 కరటిఘటా - దిగ్గజములన్నియుఁ దెలుపను ప్రయోగాంతరములు మృగ్యములు.

తే. సంభవించిరి గంధర్వ ♦ జాతిననిఁ, గలితనంజేలపెన్నాట ♦ కంబుసేయ
ననఁగ భీమేశ్వరునిఁగొల్తు ♦ రప్సరమున, సానులను పేరి యప్సర ♦ శ్చంద్రముఖులు.

మ. మెరయించున్ మరుఁ డిక్షుచాప మనిశం ♦ బుం దక్షవాటీమహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువన్ ♦ బుత్తేఁచులీలం బురం
దరవిశ్రాణితదేవతాభువనగం ♦ ధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహనూపురస్వనములన్ ♦ ఝంకించు ఝంకారముల్. 89

శా. గంధర్వోపనిషద్రహస్యములు వ ♦ క్కాణింతురాలాపసం
బంధప్రస్ఫుటఝుంటుఝుంటుపదగుం ♦ భస్థాపవర్గావళీ
సంధానక్రమదివ్యమంత్రకములన్ ♦ సాయాహ్నకాలంబులన్
గంధర్వాప్సరసల్ పురోపవనికా ♦ కల్పద్రుమచ్ఛాయలన్. 90

సీ. చరణద్వయీభూరి ♦ సౌభాగ్యసంపదఁ - బరిభవింతురు హేమ ♦ పద్మవనము
ఘననితంబస్థలీ ♦ గౌరవాభ్యున్నతి - సంప్రతింతురు నదీ ♦ సైకతముల
గంభీరతరనాభి ♦ గర్తవిభ్రమముల - వ్రక్కలింతురు జలా ♦ వర్తశోభ
గురుపయోధరభార ♦ పరిణాహ విస్ఫూర్తి గుద్దలింతురు హేమ ♦ కుంభగరిమ.
తే. గారవింతురు కంఠోప ♦ కంఠకాంతిఁ, గంబుమణికాంతి బిబ్బోక-డంబరంబు
మచ్చరింతురు ముఖచంద్ర♦మండలములఁ, బూర్ణశశిమండలముతోడఁ♦ బురము సతులు.

శా. దక్షారామవిలాసినీతతుల సౌం ♦ దర్యంబు వర్ణింపఁగాఁ
జక్షుశ్శ్రోత్రకులాధినాయకునకున్ ♦ శక్యంబె? తచ్చారుఫా
లక్షేత్రంబునుఁ బోలలేక మునిఁగెం ♦ లజ్జాభరక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖరసుధాం ♦ ధస్సింధుపూరంబులన్. 92

సీ. అంబుధరశ్రేణి ♦ హరిణలాంఛనరేఖ - క్రమకార్ముకవల్లి ♦ కామతల్లి
జలచరద్వంద్వంబు ♦ చంపకప్రసవంబు - బింబంబు దాడిమ ♦ బీజరాజి
శష్కులీయుగళంబు ♦ చారుదర్పణములు - శంఖంబు బిసములు ♦ జలరుహములు
పసిఁడికుంభంబులు ♦ బయలంబువీచులు - పుష్కరావర్తంబు ♦ పులినతలము
తే. కదళికా హేమకాహళ ♦ కచ్ఛపములు, మణులబంతులు తారకా ♦ మండలములు
సంఘటించి పురంబువే♦శ్యలసృజించె, జాణదేవర శ్రీపంచ ♦ శరవిరించి. 93

సీ. ముడువంగనేర్తురు ♦ మూలఁగమ్మనితావి - గలుగు క్రొవ్విరులు లోఁ ♦ గందకుండ
మురియంగనేర్తురు ♦ మోహనాస్పదమైన - మొగలివాకిటిచాయ ♦ నగరవీధి

వలపింప నేర్తురు ♦ వలరాజు గెలిచిన - పెద్దగాలము వేల్పు ♦ భీమనాథుఁ
బలుకంగ నేర్తురు ♦ పాటలాధరముల - మొల్కలేనగవులు ♦ ముద్దుగురియఁ
తే. చందురు నితోడఁ గల్పవృ ♦ క్షములతోడఁ, దారతో లక్ష్మితో నమృ ♦ తంబుతోడఁ
గౌస్తుభముతోడ మున్నీటఁ ♦ గలిగినారు, విబుధగంధర్వజాతుల ♦ వ్వీటిసతులు. 94

క. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁదలరుసొంపు ♦ వీడ్కొలుపుఁ బురిన్
వేఁబోకఁబోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ ♦ బొదలినగాడ్పుల్. 95

ఉ. వీటికి నాల్గువంకలను ♦ వెన్నెలతేటలఁబోలు నీళ్ళతో
హాటకపద్మమండితము ♦ లైన కొలంకులు చూడనొప్పగున్
జీటికిమాటికిన్ హరుఁడు ♦ జృంభితలీల నటింప మౌళిమి
న్నేటికి ప్రీతినిర్ఝరము ♦ లింతటనంతటఁ జిందెనోయనన్. 96

సీ. తిలకంబు బలు తేని ♦ యలఁబోఁక మోకల - పువ్వుఁబాళలతావిఁ ♦ బుక్కిలించి
కలమగోపికలచ ♦ క్కని చన్నుఁగవలపై - వటపల్లవంబులు ♦ వాయఁదట్టి
సప్తగోదావర ♦ జలతరంగారోహ - కేలీసుఖంబులం ♦ గీకరించి
దేవగంధర్వాలీ ♦ లావతీహాటక - ప్రాసాదవలభిగ ♦ ర్భములుదూరి
తే. ప్రతిదినము దక్షవాటీపు ♦ రంబునందు, మలయు వేలావనీ ♦ మందమారుతంబు
గంధసారలతాకుడుం ♦ గములమెలఁగు, చిలువతేమలు సేవింప ♦ వెలితిపడుచు,

తే. దక్షవాటికఁబశ్చిమ ♦ ద్వారభూమిఁ, బ్రతివసించును సర్వాంగ ♦ రమ్యయగుచు
సేవకులపాలి సురశాఖి ♦ పూవుఁగొమ్మ, కోమలార్ధేందుధరుకొమ్మ ♦ గోగులమ్మ. 98
తే. దక్షపురమున నుత్తర ♦ ద్వారమందు, నూర్జితంబుగ నుండుమ ♦ హోజ్జ్వలాంగి
కామితార్థైకసంకల్ప ♦ కల్పవల్లి, మహితసుగుణమతల్లి శ్రీ ♦ మండతల్లి. 99
క. సారమతి దక్షవాటిక, తూరుపుగవనిన్ బ్రసిద్ధి ♦ తో వసియించున్
హేరాళక్రీడాసం, చారిణి నూకాంబ భక్త ♦ జనరక్షణకై. 100

క. మట్టయినయట్టి దక్షుని, పట్టణమున దక్షిణంబు ♦ పార్శ్వపుఁగవనిన్
నెట్టుకొని వెలసి నిలిచిన, ఘట్టాంబికఁ గొల్వఁ గలుగుఁ ♦ గామితఫలముల్. 101
తే. పృథివిఁ బదునెనిమిది యోగ ♦ పీఠశక్తి, గణములోనెంచ సర్వశృం ♦ గారయగుచు
భీమనాథుని సన్నిధిఁ ♦ బ్రేమ వెలయు, మాణికాదేవి సకల ♦ కల్యాణమూర్తి. 102

95 వేఁబోకల=ఉదయకాలములందు, లేఁబోఁక=తిన్ననినడక; పూఁబాళ=పుష్పగుచ్ఛము

ఉ. ఏదెసఁ జూచినన్ విబుధు ♦ లేదెసఁ జూచిన మౌనిమండలం
బేదెసఁ జూచినన్ హరిద ♦ ధీశ్వరవర్గము వాసవాది యం
దేదెసఁ జూచిన న్నవమ ♦ హేశ్వరమూర్తులు శ్రీనికుంభకుం
భోదరతుండుభృంగిరిటి ♦ హూహుకహాహులు దక్షవాటికన్. 103

సీ. విరులదండ్లతోఁడి ♦ వేణికాభారంబు - పొంకంబుపిఱుఁదులఁ ♦ బొరలియాడ
మణితులాకోటికో ♦ మలఝణత్కారంబు - రవలిమట్టెలమ్రోత ♦ యవఘళింపఁ
గుదురునిండినచిన్ని ♦ గుబ్బచన్నులమీఁద - ముత్యాలత్రిసరంబు ♦ మురువుఁజూప
వలమానతాటంక ♦ వజ్రాంకురచ్ఛాయ - లేఁతవెన్నెలఁబుక్క ♦ లించియుమియ
తే. సాని యీశాన్యయై మహో ♦ త్సవమునందుఁ, గేల నవచంద్రకాంతపు ♦ గిన్నెపూని
వీధిభిక్షాటనమొనర్చు ♦ వేళఁ జేయు, మరులనృత్యంబు జగముల ♦ మరులుకొలుపు. 104

సీ. వేదండవదనశుం ♦ డాదండచులికిత - ప్రోర్మిఘితాంభశ్ఛటా ♦ ప్లుతనభంబు
దైవగంధర్వాప్స ♦ రోవధూటీస్తన - స్థాసక శ్రీగంధ ♦ ధవళితంబుఁ
గనకసౌగంధిక ♦ గంధోత్తమాగంధ - సారనిష్పందపు ♦ ష్పంధయంబుఁ
జటులవీచీఘటా ♦ ఝాటడోలారూఢ - హంససంసన్నినా ♦ దాలసంబు
తే. భూరితీరావనీఘనీ ♦ భూతచూత, జాతివకుళవనీసమా ♦ చ్ఛాద్యమాన
బహుళసింధు ధునీవన ♦ బకమరాళి, దక్షపురియొద్ద సప్తగో ♦ దావరంబు. 105

సీ. సరివచ్చు ననవచ్చు ♦ శతమన్యువీటికి - వివిధదేవాగార ♦ విభ్రమమునఁ
బ్రతివచ్చు ననవచ్చుఁ ♦ బాలమున్నీటికి - నక్షయం బగు జీవ ♦ నాభివృద్ధి
నెనవచ్చు ననవచ్చు ♦ నిందుబింబమునకు - సకలకళావిలా ♦ సప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చుఁ ♦ దోయజాక్షునిమూర్తి - కభిరామలక్ష్మీన ♦ మగ్రమహిమఁ
తే. జెప్పనొప్పదె యప్సర ♦ స్త్రీసహస్ర, ధవళతరదీర్ఘదృక్స్ఫట ♦ ధాళధళ్య
సమ్మిళద్భ్రమనాథభూ ♦ షాశశాంక, తరళదీధితిపరిపాటి ♦ దక్షవాటి. 106

క. రోధించు నభముఁ బటికపు, సౌధంబులు వీట భీమ ♦ శంకరహర్షో
త్సేధాట్టహాసరేఖా, దీధితిమైత్రీత్రిధావి ♦ ధేయములగుచున్. 107

చ. ప్రహరిచరింతు రెప్పుడును ♦ భైరవు లర్ధనిశాగమంబులన్
గహకహనిష్ఠురాట్టహాస ♦ గర్వితకంఠకఠోరహుంకృతుల్
బహులభుజా డమడ్డమరు ♦ భాంకృతినాదము మేళగించి ది
క్కుహరములోర్చు హాటకపుఁ ♦ గోటలమీఁదట దక్షవాటికన్. 108

వ. మఱియు నప్పురంబు దళితసమదకరిసహస్రంబులగు సుభటసహస్రంబులవలన సింహసంహతియు, సమధికవితరణశాఖానిరాఘాటకీర్తిస్ఫూర్తులగు వదాన్యులవలనఁ బారిజాతోద్యానంబును, ననేకశతసవనసమజ్యోతిహోత్రియగు సుమనోవర్గంబువలనను ధర్మస్థానంబును, నభిరామరామణీయకసౌభాగ్యరేఖావిలాసపక్ష్మాంతలక్ష్మీవిరాజమానంబగు రాజకుమారలోకంబులవలన గంధర్వలోకంబును, మకరకచ్ఛపముకుందనిధినాథులగు వైశ్యులవలన వైశ్రవణస్థానంబుననందగి, సకలభువనప్రశస్తంబై; భారతవర్షంబునకు ఫలసంపదయునుంబోలె శాఖానగరసహస్రసంబాధపరిసరంబై; సకలజగన్నిర్మాణమాతృకయగు కృతయుగంబునకుం గారణంబనఁ గనకగిరివప్రదీప్రప్రాకారబహుప్రకారవప్రప్రకరపరివేషవలయవలయితంబై; సలిలసంక్రాంతకనకావరణమండలప్రతిబింబంబగుటంజేసి కులిశపతనభయావగాహహాటకక్షితిధరంబగు నపరాంబురాశియుంబోని పరిఖాచక్రంబు చేతను, క్రీడాగజమదజలపంకిల ప్రాంగణంబులగు భృంగిరిటినికుంభకుంభోదరప్రధాన ప్రమథగణమణిభవనసౌధంబులచేతను, నాసన్నదీర్ఘికావీచీపవనవికీర్యమాణ వికస్వరజలజనిష్యందమధుబిందువర్షాంబుదూరీకృతశంభలీకపోలకస్తూరికాపత్రభంగంబులగు నప్సరోంగనావాటంబులచేతను, గుట్టిమఖచితమణికిరణవిసరణజనితాకాండప్రసారితకదళీపలాశసంగతిసంశోభితకక్ష్యావిభాగంబులగు యక్షగంధర్వకిన్నరకింపురుష సిద్ధవిద్యాధరస్థానంబులచేతను, గారుత్మతరత్నాంశుపటలఘటితపటయామినీతారకాయమానస్థలఖచితస్థూలముక్తాఫలశలాకానికాయంబులగు భైరవాయతనంబులచేతను, ప్రస్నిగ్ధశ్యామలశిలోత్కీర్ణరమ్యోపబాహ్యాశాక్వరంబులగు శంకరాగారద్వారంబులచేతను, దులసీదళశీతలామోదముషితకిల్బిషంబులగు విష్వక్సేనధామంబులచేతను, నిరంతరసంపుల్లమల్లీవల్లికాతల్లజపుష్పనిష్యందమాన మధుమత్తపుష్పంధయవిరుతిపునీతహరిదుపఘ్నంబులగు విఘ్నేశ్వరావాసలలితోద్యానంబులచేతను, బృథులవారిశీకరపటలపానదరవికటకరటిముఖవికలితవరాటకోశవ్యాకోచహాటకకుశేశయంబులగు సప్తగోదావరప్రవాహసలిలంబులచేతను, గోమలకింజల్కగ్రగ్రసనజాగ్రచ్చక్రవాకచరణనఖశిఖరసముల్లిఖితకమలకువలయకుముదషండంబులగు తీర్థకుండంబులచేతను, గోదావరీతుల్యభాగాకాంతేయాకర్ణ్యాపగానదీమాతృకాయమానంబై యిరుగారునుబంటపాసంగుపంటవలంతి కేదారక్షేత్రంబులచేతను, నఖండితాంభస్సమృద్ధి విజృంభించి విశ్వంభరాభ్రాంతిలతాకారిసేతురేఖాలంకారంబులై తటతరుకుసుమాంతరక్షరదమందమకరంద సందోహస్యందనకల్లోలంబులై సలిలకేళీలోలకలహంసకామినీకోలాహలానుకృతజలదేవతాచరణమణినూపురఝణఝణత్కారంబులై కారండవపక్షవిక్షేపపరిచరిత

పంకజపరాగపాళీవిరచితాళీక సంధ్యానుబంధచరితచక్రవాకమిథునంబులై పయోధిగన్న బిడ్డలుంబోని యొడ్డుచెఱువులచేతను, సరససహకారశాఖాశిఖాధిరూఢకోకిలకుటుంబినీకంఠనాళకోమలకుహూకారకోలాహలకలిత విరహిణీహృదయహాలాహలక్షేపంబులును మధుకరనికరగుంజాయమానమాధవీనికుంజకుంజసన్నిహిత కిరణపుంజంబులును సముద్భిన్నపున్నాగకుసుమపరిమళోద్గారనీహారంబులును సముల్లసితచంపకకళికాకలాపకల్పితకందర్పపావకాస్త్రపరిత్రస్తపథికలోకంబులును, బాకపరిస్ఫుటితపుండ్రేక్షుపర్వముఖోద్గీర్ణముక్తామణిదర్శితాకార రాకానిశాకరప్రకాశంబులును గోరకప్రకరతారకితకురువకానోకహంబులును వనితావదనాసవసనాథవకుళవనంబులును మహోదారకుచకలశకాంతిచోరఫలకలితలికుచనిచయంబులును మాతులుంగామోదహృదయంగమంబులును నవనాగరంగసంగసుఖితసారంగమంగళగానసరససంగీతప్రసంగంబులును భుజంగలతాపరిష్వంగధన్యతరుణపూగద్రుమంబులును లలితలవలీలతాలింగితలవంగంబులును నగుశృంగారారామంబులచేతను, నభిరామంబై; కలిత చాతుర్వర్ణ్యస్థితియగుటం ద్రిలోక్యతిలకంబును, సముద్భాసితాసంఖ్యదేవాలయంబగుట శతమఖనగరంబును, నక్షయజీవనధృతియగుట ధర్మపాలమండలంబును, ననధిగతకంటకరుచిరంబగుటం బ్రజాభాగ్యఘంటాపథంబును, బ్రచురసన్మణివాసంబగుట వసుంధరాధిపస్థానంబును నై, గుహ్యకనగరంబునుంబోలె వివిధమనుష్యధర్మచరితపవిత్రంబును లంకానగరంబునుంబోలెఁ బుణ్యజనాధ్యుషిత సన్నివేశంబును గార్తవీర్యార్జునమూర్తియునుంబోలె నవిరళకరభూషితంబును నృసింహలీలాడంబరంబునుంబోలెఁ బ్రథితహిరణ్యాకశిపుక్షయంబును శరత్కాలంబునుంబోలె విలసత్ప్రకాశంబును బ్రాహ్మణజాతిధర్మంబునుంబోలె నిగమశాలిద్వయునునై; మహదుద్భాసాన్వితంబయ్యును నిరాక్రోశంబును బ్రకటభుజంగప్రకారంబయ్యును నదాహితాభయంబును బలిరాజనిలయ భూతంబయ్యును గంధర్వభూమియునునై; వర్ణసాంకర్యంబు వాసవకోదండంబునంద, యహిభయంబు వల్మీకంబులయంద, జీవనసంశయంబు వారిదంబులయంద, వృషాతిక్రమంబు గృహంబులయంద, పరదర్శనంబు యతులయంద, దోషోల్లాసంబు కువలయంబులయంద, కౌరవపదానుసరణంబు కిరాతులయంద, తరళత్వంబు కరికరసంతానంబులయంద, విపత్క్షోభంబు కొలంకులయంద, యాత్తగంధత్వంబు చందనంబులయంద, కాని తనయందుఁ బొందనీక విభవంబునకుఁ బ్రభవంబును విలాసంబునకు నివాసంబును నపవర్గంబునకు సర్గంబును ధర్మంబునకు మర్మంబును దానంబునకు నిధానంబును నానందంబునకు మూలకందంబును విద్యకు నిషద్యయును విశ్రామంబునకు ధామంబునునై యొప్పునప్పట్టణంబున కధీశ్వరుండు.

సీ. హాలాహలంబను ♦ నల్లానేరేడుపండు - మిసిమింతుఁడునుగాక ♦ మ్రింగినాఁడు
పెనుమ్రేలికొనగోర ♦ బిసరుహాసనుమోముఁ - గెందమ్మివిరివ్రాలె ♦ గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ ♦ బ్రసవనారాచుని - నెఱ్ఱచిచ్చులకంట ♦ జుఱ్ఱినాఁడు
మెఱుఁగుఁగోఱలుదుల్ల ♦ మృత్యుదేవతనోరు - ఘట్టించియఱకాలఁ ♦ దన్నినాఁడు.
తే. త్రిపుర దైత్యావరోధనా ♦ రీవిలాస, దంతతాటంకములకెగ్గు ♦ దలఁచినాఁడు
దక్షపురిసానికూఁతులఁ ♦ దవిలినాఁడు, విశ్వలోకకుటుంబిభీ ♦ మేశ్వరుండు. 110

మ. ఎనయంగల్గినకూర్మి భృంగిరిటిఁగా ♦ నీ తండుఁగానీ నికుం
భునిఁగానీ కయిదండపట్టుకొని సం ♦ భోగేచ్ఛ నంత్యఃపురాం
గనలంగన్ను మొఱంగి యప్పురమునం ♦ గన్నేఱకాఁదారిఁ బ్రా
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగుం ♦ ధూర్తప్రకారంబునన్. 111

క. పదునాల్గుమహాయుగముల, ముదుకగుభీమేశ్వరునకు ♦ మొగచాటైయుం
డదు సానిపెండ్లి యెప్పుడు, నది దక్షారామమహిమ ♦ మగునో కాదో ? 112

సీ. నేదిష్ఠమునసప్త ♦ గోదావరంబున - నఘమర్షణస్నాన ♦ మాచరించి
త్ర్యాయుతమంత్రాక్ష ♦ తాభిమంత్రితమైన - విమలభూతి త్రిపుం ♦ డ్రముధరించి
మొంగలివాకిలిఁ దూటి ♦ దిగువశాక్వరరాజు - నగరిపైవెన్నని ♦ ననువుఁజూచి
మణిశిలాసోపాన ♦ మధ్యమార్గంబుగా - నభ్రంకషంబైన ♦ హర్మ్యమెక్కి
తే. సప్తపాతాళభువన వి ♦ ష్కంభములను, దెఱచివెడలినజ్యోతిః ప్ర ♦ దీప్తమూర్తి
శంభుభీమేశ్వరేశ్వర ♦ స్వామిఁగొలుచు, పరమమాహేశ్వరునకేమి ♦ ప్రాఁతిముక్తి.

క. పరమ్మాశించును భీమే, శ్వరుననుమతిఁజేసి చోడ ♦ వంశా భరణుం
డరికాలుఁడు కరికాలుఁడు, ధరణీధరపత్ని మనసు ♦ దైన్యము ముంచెన్. 114

సీ. గజచర్మమెన్నఁడో ♦ కాని నిచ్చలుగట్టు - పసిఁడికమ్ములపట్టు ♦ పచ్చడంబుఁ
భసితమెన్నఁడో కాని ♦ ప్రతిదినంబు నలందు - మలయజంబుకురంగ ♦ మదముగూర్చి
నిడుదపాములరాజు ♦ తొడవులెన్నఁడో కాని - తారహారములు ని ♦ త్యము ధరించు
నృకరంకరుండమా ♦ లిక లెన్నఁడో కాని - ధరియించు కల్హార ♦ దామమెపుడు.
తే. కాటనడుచక్కి నెన్నఁడో ♦ కాని యుండు - దక్షవాటిసువర్ణ సౌ ♦ ధములమీఁద
నెన్నఁడో పిశాచులనుగాని ♦ యిందుముఖుల - నెల్లకాలంబుఁ దలఁచు భీ ♦ మేశ్వరుండు.

సీ. ఒకవేళ ధరియించు ♦ యువనాశ్వుఁడిచ్చిన - కట్టాణిముత్యాల ♦ కంఠమాల
మాంధాతృఁడిచ్చిన ♦ మాణిక్యఖచితకే - యూరంబు ధరియించు ♦ నొక్కవేళ

111. కాఁదారి = నడురేయి. 113. నేదిష్ఠము = మిక్కిలి సమీపము.

నిష్కావుఁడిచ్చిన ♦ హీరాంగురంబుల - యుంగరంబు ధరించు ♦ నొక్కవేళ
ఘనచక్రవర్తి యి ♦ చ్చిన ప్రవాళంబుల - యొడ్డాణము ధరించు ♦ నొక్కవేళ,
తే. వేడ్క ధరియించు నొక్కొక్క ♦ వేళయందు, భరతదుష్యంతరంతినా ♦ భాగసహుష
నలభగీరథనృగమహీ ♦ నాథదత్త, హేమమణిభూషణములు భీ ♦ మేశ్వరుండు. 116

వ. వెండియు భీమేశ్వరుండు పండువుపండువు నఖండవిభవంబున నాఖండలాదివిబుధమండలంబు పరివేష్టింప చలిగొండరాచూలియుందానును మార్తాండచంద్రమండలంబువలనను బాలసముద్రంబువలనను మధుకైటభారియూరుకాండంబువలనను గృపీటభవజ్వాలాజాలంబువలనను, గంధర్వసార్వభౌమువలనను బ్రభవించి కంతుకుంతంబులనఁ గామతోమరంబులన మదనుముద్గరంబులన శంబరారికఠారంబులన నంగభవుకొంగవాలులన సిరిపట్టిసెలకట్టియలన వలరాజుభిండివాలంబులనఁ, దళతళంబొలయు తొలకరిమెఱుంగుమొలకలఁ గలకలనగు కలికితెలిగన్నుగవయును, జక్కవకవలఁదక్కవపఱచుచుఁ గ్రిక్కిఱిసినమెఱుంగు నిబ్బరంపుగుబ్బచన్నులును, మిలమిలనిజిలుఁగువలిపెంపువలువల తెరలయెడల వెలువడి కేలిగడలుకొను పసిమిగలపసిండితగటునుం దెగడు నునుదొడలజిగియును, బగడంపుఁజిగురుటధరములతుదల నిగురుచుఁ జిఱుతనగవులుబిగియనగినం దెగిపడియెడుననువడువున నడుగడుగునకు వడవడ వడంకుచుం బిడికిటనడంగునడుములబెడంగునుం గలిగి, భుగభుగం గురంగనాభిసౌరభసారంబులతోడంగూడి నంకుమదపంకపరిమళంబుల ఝుంకించు కర్పూరవాసనాసముల్లాసంబును, గర్పూరవాసనాసముల్లాసంబు నుల్లసంబాడు కాలాగురుకర్దమామోదంబుననుంబునుంగుపసం బిసాళించు గొజ్జంగినీటినెత్తావియును, గొజ్జంగినీటినెత్తావి బిత్తరించు గంధపొడిపొలుపును, గంధపొడిపొలుపునుంగుమ్మరించు ధమ్మిల్లమల్లికాహల్లకవకుళవాసంతికాజాతికేతకీకుందకుసుమగంధంబులును నిఖిలదిక్సంధిబంధంబుతో బాంధవం బనుసంధింప, నిలింపగంధర్వాప్సరోజాతులగు సానికూఁతులు గొలువ, జగనొబ్బగండ జగదగోపాల పల్లవాదిత్య పల్లవత్రినేత్ర కేళాదిరాయ రాయవేశ్యాభుజంగ బిరుదాభిరామాల్లయ వేమభూపాల రాజ్యభారధురంధరుండై, బెండపూఁ డన్నయామాత్యుఁడు గట్టించినమొగసాల వాకిటి మహోత్సవమండపంబునందుఁ, బేరోలగంబుండి, కుండలీదండలాసకప్రేరణీప్రేంఖణసింధుకందుకధమాళిచేలమతల్లీ హల్లీసకాదినృత్యంబు లవలోకింపుచుఁ, బంతంబు లవధరింపుచు, మేలంబు లాలకింపుచుఁ, జంపూచాటు నాటకోదాహరణ జయఘోషచక్రవాళ చతుర్భద్రచతురాతిప్రబంధంబు లాకర్ణింపుచు, వేణువీణామృదంగ కాంస్యకాహళ పటహ ఢక్కా హుడుక్కానక ఝల్లరీహృద్యవాద్యానుషంగంబు లాదరింపుచు, సంగీతభంగీతరంగంబు లంగీకరింపుచు, నిగమంబులు గ్రహించుచుఁ బురాణం

బులు వినుచు, నితిహాసంబు లిచ్చగింపుచుఁ, దర్కంబులు వితర్కింపుచు, నాగమంబులు పరీక్షింపుచు, నిఖిలలోకరక్షణార్థంబుగా వివిధవిద్యాకలాపంబుల వినోదింపుచుండు.

క. ఏతాదృశప్రభావుఁ, డేతుండగుదక్షవాటి ♦ భీమేశ్వరువి
ఖ్యాతకథఁ జెప్పెదను శుక, తాతకృతపురాణసరణి ♦ తప్పకయుండన్. 118

## కథాప్రారంభము.

వ. ఇమ్మహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:—నైమిశారణ్యపుణ్యక్షేత్రంబున ద్వాదశవార్షికం బైన దీర్ఘసత్రంబు ప్రవర్తిల్లుచుండఁ గులపతిశౌనకుండను పరమఋషి మొదలుగాఁ గలసంయమీశ్వరులు యదృచ్ఛాసమాగతుఁడైన రోమహర్షణిపుత్రుఁ బాదరాయణప్రియశిష్యుఁ బౌరాణికు సూత్యాహసంభవు సూతు నర్చించి యతనివలనను బంచాశత్ఖండమండితంబును, బహుసంహితాసమాకీర్ణంబును, సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబును, నైన స్కాందపురాణంబు వినువారును నందుఁబూర్వఖండంబునం బారాశర్యుండు నిజాపరాధంబు గారణంబుగా విశ్వనాథుచేతనధిక్షేపింపంబడి వారణాశి వెల్వడియె ననివిన్నవారగుటంజేసి యటమీఁదివృత్తాంతంబు వినువేడుక నమ్మునీంద్రు నభినందించియిట్లనిరి. 119

తే. కాశి వెలువడివచ్చి ప ♦ రాశరాత్మ, జుండు ఖేదంబు నొంది శి ♦ ష్యులును దాను
నెచట వసియించె నెచ్చోట ♦ నేమిచేసె, ననఘ యేతీర్థమాడె మా ♦ కానతిమ్ము. 120

వ. అనియడిగిన. 121

మ. నరసీజాసనవంశమౌక్తికకళా ♦ సర్వజ్ఞవిజ్ఞానశాం
కరినాథాంఘ్రిసరోజషట్పద సమి ♦ ద్గాండీవకోదండ భూ
భరణప్రౌఢభుజాభుజంగ మహిళా ♦ పాంచాల వేమక్షమా
వరసామ్రాజ్యరమాధురంధర జగ ♦ ద్వ్యాప్తప్రతాపోదయా. 122

క. శ్రీవీరభద్రభూపతి, సేవాహేలాకటాక్ష ♦ సిద్ధసమృద్ధ
శ్రీవిభవపాకశాసన, భావభవారాతిభక్తి ♦ పరతంత్రనిధీ. 123

మాలిని. అకుటిలనయమార్గా ♦ యాశ్రితార్థిప్రవర్గా
సుకృతిసరణిపాంథా ♦ శుద్ధకీర్తిప్రబంధా
సకలజనవిధేయా ♦ శారదాభాగధేయా
ప్రకటసుగుణసంగా ♦ రాయవేశ్యాభుజంగా. 124

గద్య. ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ
శ్రీనాథనామధేయప్రణీతం బైన శ్రీభీమేశ్వరపురాణంబను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః.

# శ్రీభీమేశ్వరపురాణము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీ ఖండ ఘుసృణ మకరీ
రేఖాలంకార సుంద ♦ రీ స్తనయుగ పా
ళీ ఖచిత భుజాంతర విభ
వాఖండల ! బెండపూఁడి ♦ యన్నామాత్యా ! 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పందొడంగె. 2

తే. మృడునిచే నిట్లుకోపానఁ ♦ బడి కలంగి, గంగ దరినుండి నిజశిష్య ♦ గణము తోడ
మద్గురుస్వామి సకలధ ♦ ర్మజ్ఞుఁ డపుడు, పృథివిఁ గలతీర్థముల లెక్క ♦ వెట్టిచూచి. 3

వ. ఇట్లనియె. 4

తే. అంబపార్వతి నాతోడ ♦ నానతిచ్చెఁ, గాశి యెక్కుడు తీర్థసం ♦ ఘములలోనఁ
గాశికన్నను నెక్కుడు ♦ గౌరవమున, మోక్షభోగ నివాసంబు ♦ దక్షవాటి. 5

వ. తొల్లి దక్షప్రజాపతి భూచరఖేచరులగు నఖిలగీర్వాణుల రప్పించి హాటకగర్భకైటభారులఁ బురస్కరించికొని మహాధ్వరంబుసేయం బ్రారంభించి. 6

గీ. అర్థితో నోషధీశ్వరుఁ ♦ డాదియైన, పెండ్లికొడుకుల నెల్లను ♦ బిలువ నంపె
గబ్బితనమున జగదీశుఁ ♦ గాలకంఠుఁ, బిలువఁబంపకమానె న ♦ బ్బిరుదులాఁడు. 7

క. అజ్ఞానంబున హరునక, వజ్ఞదలఁచి యతని నొసలి ♦ వాఁతఫలమునన్
యజ్ఞము సేసెను సురలయు, నుజ్ఞం బరవృద్ధి కప్ప ♦ నులు సమకొనునే. 8

---

7. పెండ్లికొడుకు = అల్లుఁడు.

ఉ. అల్పవుబుద్ధి నీక్రియమ ♦ హాక్రతుతంత్రముఁబన్నగాధిపా
కల్పనిఁ బాయఁబెట్టి కను ♦ గానక దక్షుఁడు చేయఁజొచ్చి యా
వేల్పులుఁ దానుదుర్దశల ♦ వేఁగె మహాప్రళయాగ్ని రుద్రునిం
బోల్పఁగ వచ్చునట్టి పటు ♦ భూరివిభుండగు వీరభద్రుచేఁన్. 9

తే. పువ్వుముడిచిన పురవీధి ♦ భూమియందుఁ, గట్టె మోవంగవలసిన ♦ కారణమున
వీరభద్రునిచే దైన్య ♦ వృత్తినొందె, దక్షుఁడట్టి మహాద్వార ♦ స్థానమునను. 10

క. తుదిఁబోయి యమ్మహేశ్వరు, పదపద్మములాశ్రయించి ♦ బ్రదికెం దానుం
ద్రిదశులుఁ బెద్దలునయ్యె, యదనునఁజూపుదురునిగ్ర ♦ హానుగ్రహముల్. 11

సీ. దక్షప్రజాపతి ♦ తప్పులోఁగొని యాత్మఁ - గృపపుట్టి మిగుల ర ♦ క్షించెఁగాన
హరివిరించిపురంద ♦ రాది దైవతకోటి - మించి క్రమ్మఱగార ♦ వించెఁగాన
నరిగియంతర్ధాన ♦ మందినతనదేవి - నెడమమేనఁ బరిగ్ర ♦ హించెఁగానఁ
గోపాగ్నిఁ గడుఁబరి ♦ తాపంబు నొందెడు - ఋషులకు నభయంబు ♦ లొసఁగెఁగాన
తే. నట్టుదెగనేసి జన్నపు ♦ టిట్ట్రి శిరము, గరిమచెడకుండ దివిప్రవేలఁ - గట్టెఁగాన
నయముగలవేల్పు శ్రీభీమ ♦ నాయకుండు, దక్షవాటంబు తీర్థంబు ♦ ధరణియందు. 12

తే. కాలకూటోపసంహార ♦ కారియతఁడు, త్రిపురదైత్యాధిపతుల మ ♦ ర్దించెనతఁడు
నిగ్రహానుగ్రహ ప్రౌఢి ♦ నిపుణుఁడతఁడు, సంతతము దేవవేశ్యాభు ♦ జంగుఁడతఁడు.

తే. ఏమిచిత్రంబు భీమేశ్వ ♦ రేశ్వరుండు, నిగ్రహానుగ్రహక్రియా ♦ నిపుణుఁడగుట
యతని నిశ్వాసముల మాత్ర ♦ నౌనొకాదొ, వేదములును జరాచర ♦ విశ్వజగము. 14

వ. బ్రహ్మాది సంస్తుతుండై నిజార్ధదేహంబున నున్నమాయారూపిణి, మహామాయాభువనమోహిని, దేవకార్యప్రయోజనంబును, మేనకాదేవిభాగధేయంబును, హిమవంతుని తపోవిశేషంబును, గారణంబుగాఁ దద్దేహంబున జన్మింప నియోగించిన భువనేశ్వరి మహేశ్వరుని దేహంబువలన నిర్ముక్తయయ్యెంగావున దక్షారామంబు ముక్తిక్షేత్రంబు నాఁబరఁగె వెండియుం. 15

క. దక్షుని సవనాగారము, దాక్షారామంబు శివుఁడు ♦ దన్మధ్యమునం
సాక్షాత్కరించియుండుట, మోక్షము భోగంబు బ్రాఁతె ♦ ముజ్జగములకున్ ? 16

తే. ధాత్రివలయంబులో భోగ ♦ దములుగొన్ని, మోక్షదంబులుగొన్నిప ♦ రీక్షసేయ
భోగమోక్షములకు జన్మ ♦ భూమియైన, దక్షవాటంబుతావు తీ ♦ ర్థములకెల్ల. 17

తే. భీమనాథేశ్వరునికన్న ♦ పెద్దవేల్పు, దక్షవాటంబుకంటె ను ♦ త్తమపదంబు
సప్తగోదావరము కంటె ♦ సకలతీర్థ, సారమగుతీర్థరాజంబు ♦ జగతిలేదు. 18

క. అచ్చమగు భోగమోక్షము, లచ్చోటం దొరకుఁ గరత ♦ లామలకముగన్
విచ్చలవిడిఁ బ్రదికినను౦, జచ్చినఁగడులెస్స భీమశంకరునగరన్. 19

క. దక్షిణవారాణశికిని, మోక్షశ్రీభోగవిభవ ♦ మూలంబునకున్
దక్షారామంబునకు స, దృక్షంబగునట్టి పుణ్య ♦ తీర్థము గలదే! 20

సీ. కాలకూటవిషాగ్ని ♦ కబళహేలాగ్రాస - కల్మాషితాసిత ♦ కంఠుచేతఁ
గుంభినీధరసుతా ♦ కుచకుంభపరిరంభ - సంభావనాకేలి ♦ శాలిచేత
గగనకల్లోలినీ ♦ కల్లోలమాలికా - స్ఫాలితబాలేందు ♦ మౌళిచేతఁ
గుటిలకుండలిరాజ ♦ కుండలాలంకార - విలసితగండమం ♦ డలునిచేత
తే. ద్రుహిణపంచమమస్తక ♦ ద్రోహిచేత, భీమనాథునిచే జగ ♦ త్స్వామిచేత
హరునిచేత సనాథమై ♦ యతిశయిల్లు, మోక్షభోగనిదానంబు ♦ దక్షవాటి. 21

వ. అని దక్షారామమాహాత్మ్యం బభివర్ణింపుచు. 22

మ. కినుకం బుట్టినయట్టి మౌనిహృదయ ♦ క్లేశంబు శాంతంబుగా
మునిశిష్య ప్రకరంబుతోడ గమనా ♦ న్ముఖ్యంబునన్ ముచ్చటల్
తనియం జెప్పుచు వేల్పుటేటి నికట ♦ స్థానంబునం దుండఁగా
వనజాతాప్తుని మండలంబు దిగియె ♦ న్వారాశిదిక్సీమకున్. 23

## సూర్యాస్తమయవర్ణనము.

తే. అల్లనల్లన గగనమ ♦ ధ్యమునుండి, వ్రాలెనస్తాద్రి కరుణసా ♦ రథిరథంబు
పశ్చిమాంభోధిమారుతా ♦ స్ఫాలనమునఁ, గేతనముమీఁది పసిఁడికిం ♦ కిణులు మొరయ. 24

క. తారాపథాంచలము డిగి, వారిజహితమండలంబు ♦ వ్రాలె నపరది
క్పారావారంబునకై, పారావతపతగపాద ♦ పాటల మగుచున్. 25

తే. మూడిమొప్పారె న ♦ స్తాద్రికూటకోటి, భానుబింబంబు కన్నుల ♦ పండువుగను
విశ్వనాథుని గుడిమీఁది ♦ విమలకాంతి, భాసురంబైన హేమకుం ♦ భంబువోలె. 26

క. చరమాచలశిఖరంబునఁ, దిరమైయొక్కింత తడవు ♦ దినకరుఁడొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున, నరవిందాక్షులకు మించు ♦ టద్దంబగుచున్. 27

సీ. సిద్ధవాహిని నీటఁ ♦ జిఱుబంతి పసుపాడి - శ్రీవిశాలాక్షికై ♦ సేయఁబోడఁగ
మొరసె నంతర్గేహ ♦ మున విశ్వనాయక - తాండవారంభమ ♦ ద్దాలరవంబు

మందారతరుపుష్ప ♦ మధుపానగోష్ఠికిఁ - బ్రారంభ మొనరించె ♦ భైరవుండు
కొక్కొరో కో యని ♦ కొమరుసామి రథంబు - కంఠంబు సాఁచి క్రేం ♦ కారమిచ్చె

తే. మొగుడఁబాఱిన యరవింద ♦ ములను బాసి, గములుగములుగ మత్తభృం ♦ గములుగూడి
డుంఠివిఘ్నేశు చెక్కులు ♦ త్యంతఁ జేరె, నభినవంబైన యపరసం ♦ ధ్యాగమమున. 28

చ. ప్రమదమదాతిరేకమునఁ ♦ బాశివిలాసవతీకదంబకం
బుమిసిన తమ్ములంపుఁగఱ ♦ యోయన నింగిలికంబు ఛాయచేఁ
గమిసిన దాసనంపుఁబువు ♦ కాంతికి డాసిన కూర్మిచుట్టమా
కొమరున సంజ యంబరము ♦ కొంగున నూన్చెఁ గుసుంభరాగముల్. 29

తే. సంజకెంపును దిమిరపుం ♦ జంపునలుపు, గమిచి బ్రహ్మాండ భాండంబు ♦ గరము మెఱసె
పరమపరిపాకదశ వృంత ♦ బంధమెడలి, పతనమగు తాటిపంటితోఁ ♦ బ్రతిఘటించి. 30

తే. కామినీవిప్రయోగదుః ♦ ఖమునఁ గుందెఁ, జక్రవాకంబు సురనదీ ♦ సైకతమునఁ
గాశికా విప్రయోగదుః ♦ ఖమునఁ గుందు, బాదరాయణముని సార్వ ♦ భౌముకరణి. 31

శా. ఆకాశాంచలవీథుల న్నిగిడె సం ♦ ధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రితపారిభద్రకళికా ♦ పాండిత్య వైతండికో
త్సేకస్ఫూర్జితచండతాండవరయో ♦ ద్రేకారభట్యుద్భట
శ్రీకంఠస్థిరదీర్ఘపాటలజటా ♦ శ్రేణిన్ విడంబించుచున్. 32

వ. అప్పుడు బాదరాయణుండు సంధ్యాసమయంబు నిరూపించి యమరసింధు ప్రవాహంబునం గాలోచితక్రియాకలాపంబులు నిర్వర్తించి యొక్క నిర్మలసైకత ప్రదేశంబునం గూర్చుండి పార్వతీవల్లభుండు తనకుఁ జేసిన యవమానంబునకు నుల్లంబునం దురపిల్లుచుండె నయ్యవసరంబున. 33

క. వెల్లిగొనె నఖిలదిక్కుల, నల్లనిచీఁకటి నవాంజ ♦ నప్రతిభటమై
భల్లూకసటావల్లిమ, తల్లీ విభ్రమదమై య ♦ దభ్రస్ఫురణన్. 34

సీ. గిరినికుంజములఁ గుం ♦ జరపుంజ మనుశంకఁ - గంఠీరవంబు ల ♦ త్యంత నెగయఁ
బల్వలంబులఁ గిరి ♦ ప్రకరంబు లనుశంక - నెఱుకురాజులు విండ్లు ♦ లెక్క వెట్టఁ
గడలి మధ్యంబునఁ ♦ గాకోల మనుశంక - జలదేవతలు భీతి ♦ సంభ్రమింప
వనములఁ గువలకా ♦ నసవాటి యనుశంక - నిందిందిరశ్రేణు ♦ లెదురు కొనఁగ

తే. రజతగిరియందుఁ దాండవా ♦ రంభరభస, భంగిపతితపరశ్వధ ♦ పాణివికట
కంధరారుద్ధగజకృత్తి ♦ కంథశంక, ప్రమథులకుఁ దోఁప నంధకా ♦ రంబు ప్రబలె. 35

తే. ప్రబలమై యంధకారంబు • బలిసియుండఁ, దారకంబులు కాంతిసెం • తయును బెరసె
నీలి పుట్టంబుఁబఱచి పై • నిలిపినట్టి, వలుఁద ముక్తాఫలములతా • వళము లట్లు, 36

శా. శ్రీవారాణశివిశ్వనాయకగళ • క్ష్వేళానుకారక్రియా
హేవాకోద్ధతిఁ జీఁకువాఱ్ప్రబలఁగా • హేలావతీ కోటిపైఁ
బూవుందూపులజోదుపుచ్చుకొనియెన్ • భూపాలలీలావతీ
భ్రూవల్లీ నిభశృంగకంబగు లస • త్పుండ్రేక్షు కోదండమున్. 37

వ. అంత. 38

## చంద్రోదయవర్ణనము.

ఉ. ఆతతలీలఁ గోమల • నవాంశుకపాళి మహాంధకారసం
ఘాతము మీఱె నద్భుతము • గా శశలాంఛనుఁ డభ్రవీథికిన్
శ్వేతవరాహమూర్తి యగు • వెన్నుఁడు ప్రస్ననియొంటికోఱ ధా
త్రీతలమెంత యంతయు ధ • రించిన యట్టి విజృంభణంబునన్. 39

తే. అర్ధమండల ముదయించు • నమృతభానుఁ, డుదయరాగంబుతోఁగూడ • నొప్పుమిగిలెఁ
బ్రకటతాంబూలరాగసం • రక్తమైన, ప్రాగ్దిశాకాంతబింబాధ • రంబువోలె. 40

క. సంకలితోదయరక్తి శ, శాంకుఁడు శోభిల్లె గైరి • కావనిధరవ
పాళింకక్రీడాపాటల, సంకరభృతకాలకూట • సంకాశుండై. 41

సీ. కాదు కా దుదయాద్రి • కనకకూటంబిది - డంబైనపానవ • ట్టంబుగాని
కాదు కా దిది సుధా • కరపూర్ణబింబంబు - కాశ్మీర శంభులిం • గంబుగాని
కాదు కా దుదయరా • గప్రకాశంబిది - నవకుంకుమా లేప • నంబుగాని
కాదు కా దిది కళం • కచ్ఛటారింఛోళి - పూజచేసిన కల్వ • పువ్వుగాని

తే. యనఁగ సప్తార్ణవములు మి • న్నందికొనఁగఁ, జంద్రకాంతోపలంబులు • జాలువాఱ
నసమశరసార్వభౌము ము • త్యాలగొడుగు, విధుఁడు విశ్వంబు వెన్నెల • వెల్లిఁ దేల్చె. 42

తే. ఉదయ రాగమునిం • చించుకుజ్జగించి, నిండుచంద్రుండు కన్నుల • పండువయ్యె
దానరాగాంతరస్నిగ్ధ • దాక్షిణాత్య, రాజశుద్ధాంతదంతవ • ద్రజములకాంతి. 43

సీ. అభిషేక మొనరించు • నమృత ధారావృష్టి- మదనాంతకుని ముక్తి • మంటపికకు
నలవ్రాకగా విశా • లాక్షీమహాదేవి - నిద్దంపు చెక్కుల • నీడఁజూచు
నెరియించు మిన్నేటి • యిసుక తిన్నెలమీఁదఁ - జక్రవాకాంగనా • సముదయంబు
డుంఠి విఘ్నేశుని • స్ఫురకంఠవేదిపైఁ - గొదమ చుక్కలరాజుఁ • గుస్తరించుఁ

తే. గాయువెన్నెల యానంద ♦ కాననమునఁ, గాలభైరవు దంష్ట్రిక ♦ డాలుకోలుపు
విధుఁడు వారాణశీ సోమ ♦ వీథిచక్కి, సభ్రిఘంటా పథంబున ♦ సరుగుసపుడు. 44
సీ. రోహిణీగాఢోప ♦ గూహసంబునఁ గన్న- కస్తూరికాస్థాన ♦ కంబనంగ
రాహుదంష్ట్రాఘాత ♦ రంధ్రమార్గంబున - లలిఁదోఁచు నాకాశ ♦ లవమనంగ
నైర్మల్యమునఁజేసి ♦ నడుమఁ గానఁగవచ్చు - కమిచిమ్రింగిన యంధ ♦ కారమనఁగ
జన్మవేళను మంథ ♦ శైలాభిఘట్టన - సంభవించిన కిణ ♦ స్థానమనఁగ
తే. విరహపరితాపవేదన ♦ వేఁగుచున్న - చక్రవాకాంగనల కటా ♦ క్షములయగ్గి
నావహిల్లినకలదూప ♦ మనఁగనొప్పు - నుడుగణాధీశబింబంబు ♦ నడిమిమచ్చ. 45
సీ. కాలభైరవుఁడు ఢ♦క్కాడిండిమము మ్రోయ-బహుభూతములుఁద్వానుఁ♦బ్రహరిదిరుగఁ
జంద్రికామధు వాని♦చాకోరములు క్కి- దేవతాసౌధవీ♦థికల సాగయు
నానందకాననా♦భ్యంతరంబులయందు - సిందువారమునఁ బూ♦శిథిలపడఁగఁ
గడునివాతములైన♦కలుమఠంబులయందు - యతులుప్రాణాయామ♦మభ్యసింప
తే. దొడ్డవయసున శీతాంశుఁ ♦ డొడ్డగిల్లెఁ, దఱపిచంద్రాతపము నేల ♦ చఱచికాయ
వంతదురపిల్లి వెన్నెల ♦ వగచివగచి, గంధవతిపట్టి యొకభంగిఁ ♦ గన్నుమోడ్చె. 46
వ. అంత. 47

## సూర్యోదయవర్ణనము.

చ. వెలవెలఁబాఱెఁ జంద్రుఁడును ♦ విన్నన దారకచక్రవాళముల్
పలపలనయ్యె దీర్ఘికా కలఁ ♦ బద్మవనంబుల షట్పదాంగనా
కలకలముల్ చెలంగె వెడ ♦ కన్ను మొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపు ♦ దిక్కునఁ దోఁచె ననూరురాగముల్. 48
సీ. ప్రథమసంధ్యాంగనా ♦ ఫాలభాగంబునఁ- జెలువారు సిందూర ♦ తిలక మనఁగఁ
గైసేసి పురుహూతు ♦ గారాపుటిల్లాలు - పట్టిన రత్నద ♦ ర్పణ మనంగ
నుదయాచలేంద్రంబు ♦ తుదఁ బల్లవించిన - మంజుకంకేలిని ♦ కుంజ మనఁగ
శతమన్యుశుద్ధాంత♦సౌధకూటముమీఁదఁ- గనుపట్టు కాంచన♦కలశ మనఁగఁ
తే. గాల మనియెడు సిద్ధుండు♦గమిచి మ్రింగి, కుతుక మొప్పఁగ నుమిసిన♦ఘుటిక యనఁగ
గగనమందిరదీపికా♦కళిక యనఁగ, భానుఁ డుదయించె దేదీప్య♦మానుఁ డగుచు. 49

## వ్యాసమహర్షి యాత్రకు వెడలుట.

వ. ఇట్లు సూర్యోదయంబగుటయు బాదరాయణుండు కాలోచితకృత్యంబులు నిర్వ
ర్తించి గమనోన్ముఖుండై కాశీవియోగజనితవేదనాభరంబు దుస్సహంబై యంతరం

గంబుఁ గుంఁదింప నెట్టకేలకు నేటికెదురీఁదువిధంబున శిష్యులుం దానును గనద్ఘనకనక మణిమయసౌధాట్టవిలాసంబైన యప్పట్టణంబునకుఁ బ్రదక్షిణక్రమంబునఁ జనువాఁడై లోలార్క కేశవులకు నభివాదనంబును భాగీరథికి నంజలిబంధంబును విశ్వేనాథునకు వినుతియు విశాలాక్షికిఁ బ్రార్థనంబును మోక్షమంటపంబునకు జయకారంబును నంత ర్గేహంబున కామంత్రణంబును గాలభైరవునకు జోహారును ఢుంఠివినాయకునకు శర ణార్థము దండపాణికి దండప్రణామంబును గుక్కుటచతుష్టయంబునకు మ్రొక్కును సకలదేవతా కోటికి నేటికోళ్ళును జేసి చనునప్పుడు కతిపయదినప్రయాణంబున. 50

సీ. గంగానదీప్రవాహ ♦ కణము మాధవదేవు-దోరంతరంబు శ్రీ ♦ తులసిచిగురుఁ
బురుషోత్తమమునందుఁ ♦ బుండరీకాక్షుని-దివ్యపాదాంభోజ ♦ తీర్థజలము
శ్రీకూర్మమునయందు ♦ శేషాహిపర్యంకు-కంఠంబుక్రొత్తచెం ♦ గల్వదండ
సింహాద్రియందు ల ♦ క్ష్మీనృకంఠీరవ-సార్వభౌము ప్రసాద ♦ చందనంబుఁ
తే. గాశికావిప్రయోగోరు ♦ గాఢతాప, శాంతికొదవెను శిశిరోప ♦ చార మగుచుఁ
జాయ తెరువున శ్రీపాద ♦ రాయణునకు, హరిహరధ్యానపూజాప ♦ రాయణునకు.

## పీఠికాపురవర్ణనము.

సీ. ఏపట్టణము మ్రోల ♦ నేళ్ళేఱు ప్రవహించుఁ-బృథివికి ముత్యాల ♦ పేరు వ్రాలె
మున్నూటయఱువది ♦ మూర్తిభేదములతో-విహరించు నేవీట ♦ వేల్పుపిండు
పీతాంబచెలి యోగ ♦ పీఠహుంకృతిదుగ్గ-ననిచికాపుండు నే ♦ నగరికెలనఁ
గుంతీమహాదేవి ♦ కూర్మిమేనల్లుఁడు - మాధవుం డేవీట ♦ మరగినాఁడు
తే. పెద్దగవనుల నేపుట ♦ భేదనమున, నెలమినిలుచుండు ద్రవిడావి ♦ హీనజఘనుఁ
డట్టి పీఠాపురముఁ జేర ♦ నరుగు దెంచెఁ, బరమశైవుండు శ్రీపరా ♦ శరసుతుండు. 52

తే. నారికేళంపుమట్టనె ♦ న్నడిమిచాయ, దళములందును బోలె నం ♦ తతముఁ బొఱ
వేణికాసారఁఖులయందు ♦ విస్మయముగ, జగతి నెక్కడి వేలేటి ♦ సాటినదులు. 53

సీ. ఏఁటేఁట విరినీట ♦ నిరుగారునుం బండుఁ-బ్రాసంగువరి చేలఁ ♦ బసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనస ♦ పండులతావి-యిందిందిరములకు ♦ విందు సేయు
వేఁబోఁకఁ బోలుపారు ♦ వింధ్యాద్రి పవనంబు-పోఁకపువ్వుల తావిఁ ♦ బుక్కిలించు
వేశ్యవాటికలందు ♦ విహరించు వలరాజు-ననయంబుఁ జెఱకువి ♦ ల్లును ధరించు
తే. నారదంబుల వలపు పా ♦ న్నలఁ బెనంగి, విచికిలామోదములతోడ ♦ వియ్యమందుఁ
బాటలీపుష్పకేతకీ ♦ పరిమళములు, పొదల విలసిల్లుఁ బీఠికా ♦ పురమునందు. 54

వ. రెండియు నవఖండమండలంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుం బోలె భీమేశ్వరమండలంబు పొరువునఁ ద్రిలింగోత్కలతలంబులనంది వింధ్యాచలపాదంబునఁ గేదారకుంభకోణార్కస్థానంబుల కుపమానంబనఁజాలి యేలేటిమేటికాలువలవలన నదీమాతృకంబులగుపంటవలంతి సలిలధౌతకలధౌతశలాకాశకలసంకోచంకరణంబులై యంకురించినవియును, గోదమపసరుటెక్కలపక్కిడాలు పుక్కిలించి యుమియుంజాలు చాయలేర్పడం బసరుపాఱు నవియును, దక్షారామ రామాజనంబుల చిలుకపక్కలచక్కఁదనంబు నెకసక్కెంబాడు బిగువుపొట్టలం గనుపట్టునవి యును, బధికనాసాపుటీకుటీరంబులకుఁ గుటుంబకములగు కమ్మదనంబులీని పాలుకుడిచి సుందరీపాళియంబున నామువలుచునవియును, బదియాఱువన్నె కుందనంపుఁబగడుఁ దెగడుచుఁ బండి యుద్దండకేదారవలయకుముదషండంబు లాఘ్రాణింపనుం బోలెఁ గ్రైవ్రాలు నవియు నై కలమశాలిశారదా ముఖాదివ్రీహిసస్యంబులవలనను, నిరంతరనారికేళచ్ఛద చ్ఛాయాచ్ఛన్న హరిదంతరంబుల భుజంగవల్లీ మతల్లికాలింగితక్రముకకంఠోపకంఠంబులఁ గ్రీడించు క్రోడదశసదష్ట స్వాదిష్ఠపనసఫలరససారణీ పరంపరాసంపూర్ణచంపకద్రుమాలవాలవలయంబులు, వనదేవతావిలాసతాళ వృంతాయమానరంభాపలాశసంభారంబులుఁ, దిలకతిలకితంబులు, విదేశవిచికిలంబులుఁ, గోరకితకురువకంబులు, నిబిడరసకేసరంబులు, నఖిలభువనాభిరామంబులు నైనయారామంబులవలనను గన్నులపండువై కుంతీమాధవదేవునకు విశ్రాంతిప్రదేశంబును, హుంకారిణీమహాదేవికి విహారసంకేతభవనంబును, పీఠాంబికాలక్ష్మికాటకూటంబును, హేలాసానికి హాలాపానగోష్ఠీమంటపంబును, సనందగి భూతబేతాళడాకినీ ప్రేతరంక భైరవవ్రాతనిర్మితప్రాకారవప్రహట్టకుట్టిమంబగు పీఠాపట్టణంబుఁ బ్రవేశించిరంత. 55

సీ. త్రపుసపుష్పలతామతల్లీపటోలికా-కారవేల్లకుడుంగకములతోడఁ
కూష్మాండవృంతాక కోలకచించికా-కాయమానకదంబకములతోడ
శాకినీమూలకచ్ఛత్రాక సారణీ - ధాన్యాక మేఘనాదములతోడఁ
బిప్పల్యుపోదకీపీతపలాండుక- వాస్తుశాఖా కోటి వాటితోడ
తే. రాజనలతోడ శృంగబేరములతోడఁ, జిఱుగడఁపుఁ బెండలముతోడఁ జేమతోడ
నొప్పునాలుగు పొలములం దుపవనములు, భువనసారము పీఠికాపురవరమున. 56

ఉ. హాటకపానపాత్రయును నారఁగఁబండినమాతులుంగముం
ఖేటము లోహదండము నెగింధరియించి పురోపకంఠశృం

గాటకభూమి భాగమునఁ ♦ గాపురముండెడు పీఠికాంబకుం
గైటభదైత్యవైరి ప్రియ ♦ కాంతకు మ్రొక్కె నతండు భక్తితోన్. 57
శా. అంతర్వాణి భజించెఁ గుక్కుటపతిన్ ♦ హాలాహలగ్రీవునిన్
శాంతస్వాంతుఁడు గొల్చె దానవవనా ♦ సంహారిణిన్ హుంకృతిన్
జింతించెన్ మునిసార్వభౌముఁడు పుర ♦ క్షేత్రాధిదైవంబులం
గుంతీమాధవుఁ బూజచేసె ఋషివా ♦ క్పుష్పోపహారంబులన్. 58
తే. హేల నీలాతరంగిణీ ♦ కూలనిలయు, బాల బాలారుణాశోక ♦ పల్లవోష్ఠి
వేల వేలావనోద్దేశ ♦ విహృతిలోల, నేల నేలాయనక పాడె ♦ ఋషివరుండు. 59
వ. అనంతరంబ మ్రొక్కి యంత మార్గాంతరం బతిక్రమించి. 60

## కుమారారామవర్ణనము.

శా. ఆలోకించె మహామునీంద్రుఁడు కుమా ♦ రారామమున్ వింధ్యకు
క్ష్మాలోపాంతధరాలలామము బహు ♦ క్రీడావనశ్యామమున్
ప్రాలేయాచలకన్యకాధవజటా ♦ భారానహార్ధేందురే
ఖాలానాయితహేమకూటకలధౌ ♦ తాట్టాలకగ్రామమున్. 61
సీ. కొమరేటి కల్యాణ ♦ కమలషండంబుల-సౌరభ్యభారంబు♦సంతరించి
నారికేళాటవీ ♦ నవపుష్పకుహళికా-వితతికన్నెలికంబు ♦ వీడుకొలిపి
యప్సరఃకాంతావి ♦ హారహాటకహర్మ్య-శశికాంతమణిగవా ♦ క్షములదూరి
భీమనాయకదేవు ♦ పేరురంబునఁగ్రాలు - భుజగహారములకు ♦ భుక్తివెట్టి
తే. రాజనారాయణస్వామి ♦ రమ్యభవన, తార్క్ష్యకేతనపతికి న ♦ ర్తనముగఱపి
పాలసెనధ్వపరిశ్రాంతి ♦ పొడవడంగ, మౌనివరుపైఁ గుమారవ ♦ నానిలములు. 62
తే. బాదరాయణుఁ డత్యంత ♦ భక్తినియతి, దివ్యవాహినిఁ గొమరేటఁ ♦ దీర్థమాడి
శిష్యవర్గంబుఁదాను ద ♦ ర్శించిమ్రొక్కి, శాశ్వతునకుఁజాళుక్యభీ ♦ మేశ్వరునకు. 63
వ. వెండియుఁ గొంత దవ్వుచని. 64

## సర్పపురవర్ణనము.

శా. కాంచెన్ సర్పపురాభిధానముఁ ద్రిలిం ♦ గక్షోణి వైకుంఠమున్
ముంచెన్ నారదకుండికాజలముల ♦ స్మోదంబుతో దేహమున్
జించెన్ గాశివియోగదుఃఖము మహా ♦ క్షేత్రంబు వీక్షించి ద
ర్శించెన్ సమ్మని లోచనోత్సవముగా ♦ శ్రీభావనారాయణున్. 65

సీ. శ్రీసుదర్శన శంఖ ♦ చిహ్నాంకితముగాక-యెపుడు మిన్నకయున్న ♦ యిల్లులేదు
బహుళోర్ధ్వపుండ్రసం ♦ పదలేక వృథయైన-ఫాలరేఖలతోటి ♦ ప్రజయులేదు
వైష్ణవోత్తమ భాగ ♦ వతసాత్త్వికులగోష్ఠి- వెలియైనవాటికా ♦ వేదిలేదు
నలినేక్షణుఁడు భావ ♦ నారాయణస్వామిఁ-దప్పించి పరదైవ ♦ తంబులేదు
తే. పరమగీర్వాణయాగవై ♦ భవము నెలవు, నిఖిలకల్యాణగుణకేలి ♦ నిలయ మనఘ
దివ్యములునూటయెనిమిది ♦ తిరుపతులకుఁ, బరమపదమైన శ్రీసర్ప ♦ పురమునందు. 66

మ. శనివారోత్సవ మాచరించె మునిశి ♦ ష్యవ్రాతముందానుఁ గ
మ్మనిపణ్యారముతోడ బూరెగమితో ♦ మండెంగ తండంబుతో
ననుగుంబాసెముతోడఁ బాండుకలమా ♦ హారంబుతో నేతితో
ఘనరంభాఫలఖండశర్కరలతోఁ ♦ గారుణ్యపాథోధికిన్. 67

తే. ద్వాదశాక్షరదివ్యమం ♦ త్రమునఁబూన్చెఁ, జెంగలువ పువ్వుదండల ♦ శ్రీధవునకు
శ్రీమదష్టాక్షరమున స ♦ ర్పించెఁ దపసి, భావనారాయణస్వామిఁ ♦ బసిఁడివిరుల. 68

వ. అనంతరంబ కతిపయప్రయాణంబులఁ దుల్యభాగాతీరంబున. 69

శా. చేతోమోదమెలర్పఁ గట్టెదురఁ గాం ♦ చెన్ భారతామ్నాయవి
ద్యాతంత్రగ్రథనాబ్జసంభవుఁడు వే ♦ దవ్యాసుఁ డభ్యర్హిత
జ్యోతిర్లింగమయస్వరూపుల జటా ♦ జూటావనాగేంద్రులన్
వాతాపీల్వలవైరి గౌతమనదీ ♦ వాస్సంగమేశానులన్. 70

తే. వేదశాఖావిభాగసం ♦ వేదియతఁడు, లలితబిల్వత్రిశాఖాప ♦ లాశసమితి
సంగమేశఘటోద్భవ ♦ శంకరులకు, నర్చనముసేయుఁబ్రణవపం ♦ చాక్షరముల. 71

వ. మఱియుఁ దుల్యభాగాతీరంబున సాంపరాయణగ్రామంబుచేరువ బిల్వాటవీ వాటిఁ
గపట భిల్లుండైన చలిగొండ తేని యల్లుని ముక్తేశ్వరు దర్శించి. 72

ఉ. వేదవిభాగముం బరిఢ ♦ వించిన పుణ్యుఁడు వేదవ్యాసుఁ బూన్చె బి
ల్వాదళపూజనంబు గడు ♦ లెస్సఁగఁ గూరిమి శిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరు ♦ ణామృతపూరముఁ జల్లు పుండరీ
కోదరభల్లు నృత్తకరి ♦ యూథపుమల్లునిఁగొండయల్లునిన్. 73

తే. పదియునార్వన్నెబంగారుఁ ♦ బరిహసించు, నవనవారగ్వధప్రసూ ♦ నములు గోసి
సాంపరాయమహాగ్రామ ♦ సవిధనిలయు,నభవుఁ బూజించెఁ బుండరీ ♦ కాక్షమూర్తి.

క. పంచబ్రహ్మంబులనున్, బంచాక్షరమంత్రమునను ♦ బంచాననునిం
బంచమవేదంబభిని, ర్మించినముని పూన్చెఁ బుంప ♦ రీకకళికలన్. 75

వ. ఇవ్విధంబునఁ గాలకంఠుసకుఁ బ్రభాతకాలపూజ నిర్వర్తించి సాత్యవతేయుండు గమ
నోన్ముఖుండై యున్నసమయంబున. 76

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి ♦ నిట్టింతులింకించె-గంభీరహుంకార ♦ గర్జనమునఁ
బ్రణవపంచాక్షరో ♦ పనిషత్ప్రపంచంబు-లెవ్వాఁడు శివునిచే ♦ నెఱిఁగికొనియె
గడసిల్లుధరయొడ్డ ♦ గెడమైననెవ్వాఁడు-త్రాసుపైఁ గట్లెచం♦దమునవంచె
నంభోనులేడింటి ♦ నాపోశనం బెత్తి-కలిగించె నెవ్వాఁడు ♦ క్రమ్మఱంగ

తే. భీమనాథేశ్వరుఁడు గౌరిఁ ♦ బెండ్లియాడి, దక్షిణాముఖకల్యాణ ♦ దర్శనమున
వత్సరము వత్సరంబు నె♦వ్వానిఁ జూచు, నతఁడు గగనాగ్రమాణిక్య♦మరుగుదెంచె.

తే. మలయదర్దురగిరిమహా ♦ మందిరుండు, తామ్రపర్ణీజలస్నాన ♦ ధౌతమలుఁడు
కలుషితాంభఃప్రసాదైక ♦ కతకఫలము, లోపమలియుఁ దాను నేతెంచెఁ♦ గుంభభవుఁడు.

శా. ద్వీపాంతోద్భవుఁడైన సంయమికులా ♦ ధీశుండు కాలోచిత
వ్యాపారంబులు దీర్చి రేపకడ ద ♦ క్షారామయాత్రోద్యమం
బాపాదింపుచు నొంక్రియానగరప ♦ ర్యంతార్థమార్గంబునన్
లోపాముద్రయుఁ దాను వచ్చు ముని నా ♦ లోకించె గోదావ్యలన్. 79

తే. ద్వాదశక్షేత్రయాత్రావి ♦ ధాననియతి, భీమమండలిఁ జరియింపఁ ♦ బృథులభక్తిఁ
గుక్కుటేశ్వరు దర్శింపఁ ♦ గోర్కెపుట్టి, యట్టి పీఠాపురంబున ♦ కరుగువాని. 80

ఉ. ఉపులు భీమలింగము గు ♦ ణించి జపం బొనరించి నిచ్చలున్
మాపటిదాఁకఁ దీర్థముల ♦ మజ్జనమాడుచు నుండు వానిఁ బీ
ఠాపురికుక్కుటేశ్వరుని ♦ డాయఁగఁ బోయెడువానిఁ దుల్యభా
గాపగ చెంత శంకరగృ ♦ హాంగణ బిల్వవనాంతరంబునన్. 81

వ. అప్పరమమాహేశ్వరుం గనుంగొని సాత్యవతేయుండు ప్రత్యుత్థానంబుచేసి యెదు
ర్కొనియె నతండును. 82

సీ. భస్మత్రిపుండ్రాంక ♦ ఫాలప్రదేశుని-రుద్రాక్షమాలికా ♦ రూఢవక్షు
నుపవీతకృష్ణాజి ♦ నోత్తరాంగునిఁబల్ల-వారుణాంచితజటా ♦ పటలధారుఁ
దామ్రపాత్రాంగుళీ ♦ దర్భమూలపవిత్రుఁ-దరుణకింశుకలతా ♦ దండధారుఁ
బ్రావృషేణ్యవినీల ♦ పాథోధరశ్యాము-సాలవృక్షప్రాంశుఁ ♦ జారుదేహుఁ

తే. బరమభాగవతోత్తమ ♦ ప్రథమగణ్యు, విమలమాహేశ్వరాచార ♦ వీథిపథిక
నఖిలవీవారముప్పింప ♦ చాగ్రవరునిఁ, బులిసనంభవుఁ బొడగాంచెఁ♦గలశజుండు. 83

ఉ. యోజనగంధినందనుఁడు ♦ నూత్నశిపట్టియు నిర్ణిరోధని
ర్వ్యాజనిరంకుశప్రణవ ♦ వైభవసంపద సొంపు మానసాం
భోజములం దలిర్ప ముని ♦ పుంగవు లొండొరుఁగౌఁగిలించి వి
భ్రాజితలీలఁ జెప్పిరి ప ♦ రస్పరముం గుశలప్రసంగముల్. 84

క. వినయము భక్తియు సంభ్రమ, మును సౌహార్దంబు హృదయ ♦ ములు మొలతేరన్
వినుతి యొనర్చి రగస్త్యున, కును వైశంపాయనాది ♦ కులు మునిశిష్యుల్. 85

వ. అనంతరం బాతుల్యభాగాతీరబిల్వతరువనాంతరమున శశికాంతశీతలశిలాతలప్రదేశంబున నాసీనులై యిల్వలాసురదమనుండును బరాశరనందనుండును గొంతతడ విష్టకథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చి రప్పు డగస్త్యుండు సాత్యవతేయున కిట్లనియె. 86

అగస్త్యుఁడు వ్యాసమహర్షిఁ గాశిఁ బాసి వచ్చుటకుఁ గారణం బడుగుట.

తే. ఆననమునందు వైవర్ణ్య ♦ మగ్గలించెఁ, గన్నుగవయందు దైన్యంబు♦గానఁబడియె
నార్తి నేఁడేనియొకటి నీ ♦ యంతరంగ, మూనియున్నది యిదియెట్టు♦లొక్కొ యనఘ.

సీ. లోలార్కునకు నీవు ♦ లోలోన నేమేనిఁ-బోటిపుట్టదు గదా♦మాటమాట
వెసకయ్యశీకుంతి ♦ విఘ్నేశ్వరస్వామి-ధిక్కరింపఁడు గదా ♦ తెగువ నిన్న
నాఁకొన్న నిన్ను మ ♦ ధ్యాహ్నకాలంబున-నరయకుండదు గదా ♦ యన్నపూర్ణ
నెపమేమియును లేక ♦ నీయెడాటమ్మునఁ-బాటిఁదప్పఁడు గదా ♦ భైరవుండు

తే. ఎట్టు పాసితి మిన్నేటి ♦ యిసుకతిప్ప, యెట్టుపాసితి వాస్థలం ♦ బేనుకోను
లెట్టుపాసితివవిముక్త ♦ హట్టభూమి, యెట్టుపాసితి విశ్వేశు ♦ నిందుధరుని. 88

క. కాశీనందన కంతే, కాలుల శిరములకు విరులు ♦ కల్పించు నొకో
లీలావనాంతరమునను, మాలోపాముద్రయిడిన ♦ మల్లీవల్లుల్. 89

శా. ఆమందాకిని యాత్రివేణి వలనం ♦ బాబాహ్యకక్ష్యాస్థలం
బామధ్యాంతరకక్ష్య లావిమలది ♦ వ్యజ్యోతిరుజ్జృంభణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం ♦ జింతింపఁ గాశీమహా
గ్రామంబెప్పుడు నాకనుంగవకు సా ♦ క్షాత్కారముంగా గొనున్. 90

శా. ఆనందంబున నర్ధరాత్రములఁజం ♦ ద్రాలోకముల్ కాయఁగా
నానాసైకతవేదికాస్థలములన్ ♦ నద్దిక్కులన్ శంభుఁగా
శీనాథున్ దరుణేందుశేఖరు శివున్ ♦ శ్రీకంఠునిన్ బాడుదు
నే నెల్లన్ బులకాంకురప్రకరముల్ ♦ నిండార మిన్నేటిలోన్. 91

క. గంగాయమునాతీరో, త్సంగమునఁ బ్రయాగనున్న • దాశివు విశ్వే
శుం గూర్చి తపము చేసితి, నంగుష్ఠము ధరణి మోపి • యతిఘోరముగన్. 92

తే. విస్మయము నాకు మదిలోన • విస్తరిల్లెఁ, బరమధర్మజ్ఞ కాశికా • పట్టణమున
నుండు మూఢాత్ముఁడైనను • నొందుకడకుఁ, బోవఁ దలఁచెదు నీ కెట్లు • బుద్ధి పుట్టె?

వ. అనినఁ బారాశర్యుండు వాతాపిదమనున కిట్లనియె. 94

## వ్యాసులు తాను గాశిఁ బాసిన కారణంబుఁ జెప్పుట.

చ. సమధికసత్త్వవీర్యవరులు • జైమినిపైలసుమంతు లాదిగా
శమదమసద్గుణాన్వితులు • సానులు శిష్యులు తోడఁ గూడిరాఁ
గ్రమమునఁ దీర్థయాత్రకు ధ • రాతలమం దఖిలంబుఁ ద్రొక్కి భా
వము భవభక్తియుక్తముగ • వచ్చితిఁ గాశికిఁ బుణ్యరాశికిన్. 95

క. ఏమిశకునమునఁ జొచ్చితి,మో మన్మథదమనుపీ డ • హోరాత్రంబుల్
మేమేడునాళ్లదనుకను, స్వామీ! యుపవాసముండి • జడిసితిమి మదిన్. 96

క. గేహములకేగి భిక్షాం, దేహియన నీవ్వ టెనిక ప • తివ్రత యైనన్
సౌహార్దంబునఁ దెడ్డెం,డాహారము పెట్టదయ్యె • నా దినములలోన్. 97

శా. శ్రీవిశ్వేశ్వరదేవదేవుని కృపా • శ్రీచే దివోదాసు బా
హావిశ్రాంతబలంబుచేత ధవళో • న్యాయప్రజావృద్ధినె
ప్పె విశ్రామముగల్గి సుస్థిరతరం • బై యుండి భాసిల్లఁగా
నీ వారాణశిలోన భిక్ష కఱవ • య్యెం జూడుమీ కుంభజా. 98

శా. వైశంపాయనుఁ డెంతయున్ సుడివడెన్ • వ్యాడెన్ సుమంతుం డతి
క్లేశం బందిరి పైలజైమినులు దుః • ఖించెన్ మదిన్ దేవలుం
డాశాంతంబులు చూచె దాల్భ్యుఁ డుదరో • దగ్రక్షుధాక్షోభచేఁ
గాశీపట్టణవిప్రవాటికల భి • క్షాలబ్ధి లేకుండుటన్. 99

తే. అక్కటా యేమి చెప్ప విం • ధ్యాద్రిదమన, కాశిలో నేడు నాళ్లు ని • ష్కారణంబ
శిష్యులును నేను నిట్టుపా • సెంబు వడితి,మమర గంగానదీసైక • తములయందు. 100

వ. అష్టమదివసంబుసం దరుణోదయకాలంబున గంగాపులినోత్సంగంబులం గుశశయనంబున మేలుకాంచి యభ్యుదితంబైన మార్తాండమండలం బాఖండలదిశావేదండకంఠగ్రైవేయకనకఘంటికాతంకారంబునుం బోలె నుదయగిరిశిఖరతటనవిధంబునఁ గుంకుమరజస్సానసరేణవిసరంబునుం బోని నిగనిగనునుజిగిగీలుకొని కోమల జిలుఁగుజిగిలొన లు గగనతల మలమికొనుకొలఁది మణికర్ణికాంభః ప్రవాహంబున నఘమర్షణస్నానంబా

చరించి యత్తీరవాసిజనవిరచితవాలుకాలింగంబులకుఁ బీఠార్చనాశంభులింగంబులకును మంత్రాక్షతపుష్పకపూర్వకంబుగా నభివాదనంబుఁజేసి పంచబ్రహ్మపంచాక్షరీమంత్రప్రధానంబులు జపియించి సిద్ధమునిపరంపరాసంకులంబైన ఘంటాపథంబునం. గంగాబహిర్గేహదేహళీవిభాగంబును నంతర్గేహసౌధవీథికాట్టకుట్టిమప్రఘణంబులును గడిచి లోలార్కకాలభైరవడుంఠివినాయకవిశాలాక్షీ ప్రముఖపరివారదేవతాకోటికి నేటికోళ్లు సమర్పించి విశ్వేశ్వరు విరూపాక్షు నక్షీణమోక్షలక్ష్మీసామ్రాజ్యసింహాసనారూఢుం దారకోపదేశదేశికు దాక్షిణ్యపుణ్యకరుణాకటాక్షవీక్షాపేక్షనిఁ బ్రదక్షిణక్రమదండప్రణామపురస్సరంబుగా సేవించి ముక్తిమంటపంబునఁ గొంతతడవుండి మధ్యాహ్నకాలం బగుట నిరూపించి భిక్షాపాత్రంబులఁ గేలంబూని యతికఠోరజఠరక్షుధాగ్నితాపంబునకుఁ దోడగు తపనమయూఖప్రచండకిరణకాండప్రకాండంబులు నెత్తి మండింప లేదు నడువుండు పొండు కూడ దను నిషేధవాక్యంబులు చెవులునిండికొన విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి విసికి విసిమాలి వేసరి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన.

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదు ♦ ష్క్రోధాంధ కారంబునం
జక్షుల్ రెండునుఁ జిమ్మచీఁకటులుగా ♦ సంరంభ శుంభద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁబొందఁ గడును ♦ ద్రేకించి హస్తంబునన్
భిక్షాపాత్రలు రాతిమీఁద శతధా ♦ భిన్నంబుగా వైచితిన్. 102

క. అటు పౌరవీథిచక్కటిఁ, బటుకుసఁ బడవైచి క్రోధ ♦ పరిపాటిమెయిం
గటములదరంగ భ్రూకుటి, నిటలములను జెమటనీరు ♦ నిండ ఘటిల్లన్. 103

క. ఏమి యని చెప్పుదును లో, పాముద్రా ప్రాణనాథ ♦ ప్రజ్ఞావిభవం
బేమాయయి చెడిపోవఁగ, నామది నెన్నండు లేని ♦ నైచ్యము పొడమెన్. 104

సీ. ఏలా విచారింప ♦ నిందురేఖామాళి – వివిధమూర్తికధాతు ♦ విశ్వనాథు
నేలా వితర్కింప ♦ హిమశైలశేఖరో – పీపకాశేయంబు ♦ సిద్ధతటిని
నేలా పరీక్షింప ♦ నిభరాజ వదనుని – డుంఠి విఘ్నేశు మం ♦ డూకజఠరు
నేలా విలోకింప ♦ శ్రీశాకళాశూన్య – కటిఁ గాలభైరవు ♦ వటుకనాథు

తే. నిఖిలకైవల్యకల్యాణ ♦ నిలయమైన, కాశిపైఁ గూడు లేకుండు ♦ కారణమున
నలిగి శపియింపఁగాఁ బూని ♦ యందుకొంటి, ధృతకమండలు భాగీర ♦ థీజలంబు. 105

ఉ. కోపము సంహరించు ముని ♦ కుంజరయంచు లలాటదేశసం
స్థాపితపాణిపద్మయుగ ♦ సంఘటితాంజలిబంధులై మహా

తాపసశిష్యబృందములు ♦ ధర్మపథంబును దెల్పి చెప్పఁగా
శాపజలంబు పూనితిఁ బ్ర ♦ శాంతివిహీనత నేమి చెప్పుదున్. 106

వ. ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాససంభూతప్రభూతరోషావేశంబున నంగుళీ పవిత్రసనాథంబైన హస్తంబున మణికర్ణికాజలంబులు ధరియించి యిట్లని శపియింప నుద్యోగించితి. 107

## వ్యాసులు కాశిన్ శపింపఁబూనుట.

శ్లో. మాభూత్త్రైపురుషీ విద్యా, మాభూత్త్రైపురుషమ్ధనమ్
మాభూత్త్రైపురుషీభక్తిః, కాశ్యామ్ నివసతామ్ సదా. 108

తే. అని శపింపఁగఁ బూనున ♦ య్యవసరమున, నేమి చెప్పుదు నో సంయ ♦ మీంద్రవంద్య
యుదిలగొని కంప మందుచు ♦ నుండెఁ గాని, శాపజల మందుకోఁ గేలు ♦ సాఁగదయ్యె.

వ. ఆసమయంబునఁ గాశికానగరసోమవీథికాభవనవాటికామధ్యంబున నొక్కయింటిమచ్చుకంటి పంచాశద్వర్షదేశీయపలితసారంబైన వేణికాభారంబు గ్రైవడ మెదుసలిచక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీఁగుచన్నుల క్రేఁగుఁదనంబునఁ దనతనూవల్లి జలదరింపఁ గంకణఝుణఝుణత్కారంబు దోరంబుగాఁ గ్రక్కున గోపురద్వారంబు బోరుతలుపు వాయందట్టి యందియలరవలితోడం గూడి మట్టియల క్రమోఁత త్రిభువనంబులు నురుజగొనం దెరుగడుపయోలం జరణపల్లవంబుఁ జాఁచి యనంగధ్వజపటకఠోరపాఠీనచ్ఛాయాదాయాదంబులైన వెణఁదకన్నులు తలచుట్టునుం బలిసి పాలయు కలమసురవీణాక్వాణపాణింధమంబైన యెలుంగునెత్తి యో బ్రాహ్మణోత్తమా! శాపము సంహరించి యిటు రమ్మని నన్నుఁ జేరం బిలిచిన. 110

ఉ. సంతసమంది యే నపుడు ♦ శాపజలంబులు పాఱఁజల్లి వే
దాంతవచోమహోపనిష ♦ దర్థమయిన్ శుభరూప వృద్ధసీ
మంతినిఁ గాశికానగర ♦ మధ్యనివాసిని విశ్వనాథుశు
ద్ధాంతము డాయఁబోయితిఁ బ్రి ♦ యంబును భక్తియునుం దలిర్పఁగన్. 111

ఆ. డాయఁబోయి యప్పు ♦ డాయమ్మ యెవ్వరో, యేకులంబునదియొ ♦ యెఱుఁగకయును
నే జొహారునిడితి ♦ హృదయంబ నేరము, నెదురు ప్రాభవంబు ♦ నేర్పరింప, 112

వ. అంత నన్నుం జేరఁబిలిచి యక్కాంత యిట్లనియె, 113

తే. భిక్ష లేదని యింత కో ♦ పింతురయ్యా? కాశికాపట్టణముమీఁదఁ ♦ గాని నేయు
నీమనశ్శుద్ధిఁ దెలియంగ ♦ నీలకంఠుఁ, డింత చేసెను గాక కూ ♦ డేమి బ్రాఁతి. 114

తే. శ్రీవిశాలాక్షి బంగారు ♦ త్రెడ్డునందు, నమృతపాయస మొసఁగు న ♦ భ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్న ♦ కాల మనఁగ, వినియు నెఱుఁగవె యాతిథ్య ♦ వేళలందు.

ఉ. ఏడు దినంబు లన్నమున ♦ కెడ్డము పుట్టిన యంతమాత్రలో
నేడు మచున్నవాఁడవు ము ♦ నీశ్వర నేఁడును నీదు ధీరతల్
పాడఱిపోయెనే శివుని ♦ భార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం
గాడు నొనర్పఁ జూచెదవు ♦ కంఠపుఁ గ్రోధము పెచ్చులెచ్చఁగన్. 116

ఉ. క్రొన్నెలపువ్వుదాల్పునకుఁ ♦ గూరిమిభోగపురంధ్రి కక్కటా
యిన్నగరీలలామమున ♦ కీపరిపాటికి నిట్టికోపమే
లన్న! ఘటించె దో మునికు ♦ లాగ్రణి నిక్కమువో బుభుక్షితః
కిన్నకరోతిపాపమను ♦ కేవలనీతిఁ దలంచిచూడఁగన్. 117

తే. కాశిపైఁ గోపగించంగఁ ♦ గాదు నీకు, నెంత కోపించునో యింత ♦ కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము ♦ వెదకఁ దగదు, భిక్షఁ గొన రమ్ము మాటలు ♦ పెక్కులేల.

వ. అనిన నవ్వాలుఁగంటికి నిట్లంటి, 119

శా. తల్లీ! యిన్ని దినాలకేనియు సుధా ♦ ధారారసస్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలు కె ♦ ట్లోవింటి నిప్పేటిలోఁ
బెల్లాఁకొన్నతనాస నే నొకఁడనే ♦ భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ నిజం ♦ బేర్పాటుగాఁ జెప్పుమా. 120

తే. ఈవు పెట్టిన భిక్ష మే ♦ మిందఱమును, బంచుకొని చేయువారము ♦ ప్రాణరక్ష
నాతి యందఱవియును బ్రా ♦ ణములు కావె! నాయదియె ప్రాణమని వత్తు ♦ నా! భుజింప.

వ. అనిన మందస్మితవదనారవిందయై యయ్యిందుబింబానన యిట్లనియె, 122

శా. అంతేవాసులు నీవుఁ గూడుకొని మ ♦ ధ్యాహ్నాభిషేకక్రియల్
శాంతస్వాంతత జాహ్నవిం జలిపిపె ♦ ల్పున్ రండు నే నింతలో
నంతర్గేహమునన్ సమగ్రముగ మీ ♦ కాహారము ల్వేగఁ గ
ల్పింతున్ భోజన మిష్ట మిందఱికిఁ దృ ♦ ప్తిన్ బొందఁగాఁ బెట్టెదన్. 123

క. ఆఁకొంటి రిన్ని దినములు, పోఁకంతయు భిక్ష వీటఁ ♦ బుట్టక యునికిన్
ఆకట దూఁకట నలిగితి, రేఁకట వాయంగ భిక్ష ♦ లిడియెద రండీ. 124

వ. అనిన నేమును వియల్లోకకల్లోలినికిం జని యాప్లవనం బాచరించి యుభయపవిత్రిం

బులు ధరియించి వేదంబులు పఠియింపుచు వచ్చి యమ్మచ్చుకంటియింటి మొగసాలఁ
గూర్చుంటిమి. 125

క. మున్నాఱు శిష్యులును నే, నన్నెలతుకతోడ మాట • లాడిన యయ్య
భ్యున్నతసౌధముమీఁదను, సున్నమునిగుడించినట్టి • జోడరుగులపై. 126

వ. ఉండి యాసారప్రసారంబులు చేయు శంభళీజనంబులచేతను మారాకయెత్తింగిం
చిన నబ్బోటి హాటకమయంబైన గోడఁగుపావలుగిలుకలు గులుకరింపఁ గుసుమ
కోదండసమ్మోహనకాండంబునుం బోని యొక్క రెండవవయసుతాంబూలకరండ
వాహినిం గైదండపట్టుకొని యేతెంచి రండు విచ్చేయుం డని సబహుమానంబుగాఁ
దోడ్కొనిపోయి చంద్రికాసంకాశకౌశేయశతసహస్రసందానితవితానోపశోభితం
బును, గాలాగురుధూపధూమవాసనాసనాథంబును, గర్పూరరచితరంగవల్లీవేల్లితంబు
ను, గస్తూరికాలేపనసురభిళశశికాంతమణిశిలాకుట్టిమంబును, నగు చతుశ్శాలాభోజ
నమందిరంబున వృద్ధానుపూర్వకంబుగ సుచితాసనంబులం గూర్చుండ నియమించిన.

క. మొగి విరిసి కఱకుగూడక, పగులక వెడలుపును నిడుపుఁ • బసిమియుఁ గలలేఁ
జిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ • దివ్యపురంధ్రుల్. 128

న. అనంతరంబ. 129

తే. అర్చనలు చేసి గంధపు • ష్పాక్షతముల, ధూపమిచ్చెఁ గాలాగురు • ధూమరేఖఁ
గప్పురంబు నివాళించెఁ • గమలనేత్ర, పంక్తిపంక్తికి నేతెంచి • బ్రాహ్మణులను. 130

ఉ. ఇందఱుఁ గూడి శాంతి పఠి • యింపుఁడు మజ్జనమాచరింపుఁ డ
ర్ధేందుకళాకిరీటునకు • నీయమృతాన్నము లీ పదార్థముల్
మందగతిం భుజింపుఁడు స • మస్తజగత్పతి కాశికాపురీ
మందిర విశ్వనాయకుఁ డు • మాపతి ప్రీతి వహించుఁ గావుతన్. 131

వ. అని పంక్తిపంక్తి నడుమ నిలుచుచుఁ నయ్యింతి భక్తిశ్రద్ధా తాత్పర్య విశ్వాస పూ
ర్వకంబుగా నుర్వీగీర్వాణవర్గంబులఁ బ్రార్థింపుచు నాపోశనంబులు పోయింపుచుం
డె నప్పుడేను బైలసుమంతుజైమినివైశంపాయనాదిశిష్యప్రకరంబు నెష్ఠనంబులనిల్లని
వితర్కింపుచుంటిమి. 132

ఉ. వండినచొప్పనుం బాగయు • వాసనయుం బొగపాఱు చందమున్
భాండసమృద్ధి సంపదయుఁ • బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్తప్రియ • మాడెడు నేఁడును భోజనంబు లే
కుండుట గాసనయ్యె నని • తోత్పలగంధియు నేమిహాయయో. 133

ఉ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్ర ♦ సాదము మాధురియుఁ న్వివేకము
న్వొల్లదనంబు మార్ధ్యమును ♦ నిర్మలినత్వముఁ జూడవచ్చినం
గల్ల యొకింతయేనిఁ బొడ ♦ గానఁగరా దరఁ టాకుఁజూచినన్
ఝల్లనె గుండె యోగిరము ♦ శాకములుం బొడగానరామికిన్. 134

తే. పాత్రసంశుద్ధి కాజ్యంబు ♦ పస్తరించి, యూరకుండిరి యిదియేమి♦యొక్కొ వీరు
కానరావిఫ్డు శాకపా♦కములు నెదుర, మనకు నిజమయ్యె నలచంద♦మాయఘుటిక.

మ. అవుగాకేమి నిజంబు తేటపడఁగా ♦ నర్చించె గంధాక్షతా
దివిశేషంబుల శాంతిపాఠమును సం ♦ దీపించె విశ్వేశ్వరున్
శివు నుద్దేశము చేసి మ్రొక్కి వివిధా ♦ శీర్వాదముల్ గైకొనెం
ధవళాంభోరుహనేత్ర యింతయును మి ♦ థ్యాదృష్టి గానేర్చునే. 135

క. కానీ యీదివసంబును, నే నిన్నఁటియట్లకాక ♦ యేమనఁగ నపో
సానంబులు వడ్డించిరి, మానవతీజనులు లీల ♦ మహిదివిజులకున్. 136

తే. పోసి రాయెల్లవారి కా ♦ పోశనములు, నారగింపుఁడు లెండు మీ♦కమృతమస్తు
ప్రొద్దుపోయెను జుండని ♦ బుజ్జగించి, మ్రొక్కి యంజలియొత్తె న♦మ్ముదుకపణఁతి. 137

శా. ఆముత్తైదువ యాజ్ఞ విప్రనికరం ♦ బాపోశనం బెత్తినన్
సామర్థ్యం బది యెట్టిదో నిఖిలమున్ ♦ సంపూర్ణమై పత్రిపా
త్రీమధ్యంబునఁ బిండివంటకములుం ♦ దివ్యాన్నముల్ షడ్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయము ♦ ల్సంధిల్లె నొక్కుమ్మడిన్. 138

ఉ. పప్పును బిండివంటలును ♦ బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలుగాఁగఁ జుట్టునను ♦ గూర్పఁగఁ గూడిన యేరుఁబ్రాలతె
ల్గప్పరభోగివంటకము ♦ గమ్మని తాలిపు సాజ్జెపిండితో
నొప్పులుగా భుజించిరి బు ♦ ధోత్తములాఁకటిచిచ్చు పెచ్చునన్. 139

క. తరుణి యిది యన్నపూర్ణా, పరమేశ్వరి గాని యితర ♦ భామిని గాదం
చరవాయి గొనక మెసఁగిరి, పరమమునీశ్వరులు పంచ ♦ భక్ష్యాన్నంబుల్. 140

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో ♦ రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ ♦ గ్రొన్నేతితోఁ బప్పుతోఁ
నక్షయ్యంబగు నేరుఁబ్రాలకలమా ♦ హారంబు నిశ్శంకతం
గుక్షుల్ నిండఁగ నారగించితిమి య ♦ క్షుద్రక్షుధాశాంతికిన్. 141

ఆ. ఎవ్వఁడే పదార్థ ♦ మెంతేనిఁ జింతించు, నతని కా పదార్థ ♦ మంత గలిగి
యరఁటియాకు మీఁద ♦ నవతారమై యుండు, నిట్టి మహిమ చూడ ♦ మెన్నఁడేని.

ఉ. వేలుపుగిడ్డియుం బరుస ♦ వేదియుఁ గల్పకుజంబుఁ దోడ రా
లాలితపాదనూపురఝ ♦ ళంఝుళనాదములుల్లసిల్లఁ బైఁ
జేలచెఱంగు దూలఁగ వి ♦ శృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృ ♦ తాన్నముఁ బెట్టుచు నన్నిపంక్తులన్. 143

వ. ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాతిరోదసికతాంచితంబును, బాయసాపూపసంపన్నంబగు కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీరక్షౌద్రపుంశ్రేక్షుఖండమండితంబును, రంభానారికేళఫలపాకశాకసాకల్యకల్యంబును, పాడబరసావళీపానకప్రచురంబును, శరచ్చంద్రచంద్రికాధవళదధిసమృద్ధంబును నైన భోజనోత్సవంబు వైశంపాయనమనఃప్రమోదనసంపత్సంపాదనలంపటంబును, సుమంతుసంతోషకారణంబును, పైలరసనాతపఃఫలంబును, జైమినికామనాకామధేనువును, దేవలముదావహంబును, రోమహర్షణహర్షోత్కర్షావహంబును, సూతకౌతూహలకౌతుభూతంబును, నన్నన్నసౌరథవిహారఘంటాపథంబును నై ప్రవర్తిల్లెఁ దదనంతరంబ. 144

ఆ. హస్తములను గడిగి ♦ యాచమనక్రియా, వ్యాప్తిదీర్చి దేవి ♦ యాజ్ఞ మేము
విమలసౌధమధ్య ♦ వేదికాస్థలమున, విశ్రమించియున్న ♦ వేళ యందు. 145

వ. అభ్యంతర భవనంబునందుండి. 146

## విశ్వనాథుఁడు పార్వతితోడ వ్యాసాదు లుండిన వేదికకడకు విజయముచేయుట.

సీ. చంద్రబింబానన ♦ చంద్రరేఖామౌళి-నీలకుంతలభార ♦ నీలగళుఁడు
ధవళాయతేక్షణ ♦ ధవళాఖిలాంగుండు-మదనసంజీవని ♦ మదనహరుఁడు
నాగేంద్రనిభయాన ♦ నాగకుండలధారి-భువనమోహనగాత్ర ♦ భువనకర్త
గిరిరాజకన్యక ♦ గిరిరాజనిలయుండు-సర్వాంగసుందరి ♦ సర్వగురుఁడు

తే. గౌరి శ్రీవిశ్వనాథుండు ♦ కనకరత్న, పాదుకలు మెట్టి చట్టలు ♦ పట్టికొనుచు
నేగుదెంచిరి యొయ్యార ♦ మెసక మెసఁగ, విహరణక్రీడ మాయున్న ♦ వేదికపుడు.

తే. జయయు విజయయు నొకవంక ♦ నరన రారు, నందికేశుండు ముందర♦నడచి రాఁడు
ప్రథమదంపతు లేమి సం♦భ్రమము లేక, యరుగుదెంచుట యద్భుత♦మయ్యెమాకు.

శా. గౌరిం జూచినయప్పు ♦ డంచితమహాకారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁజూచినపుడు ♦ ద్యత్క్రోధసంరంభముం

ద్రోరంబై యపు డంతరంగముల సం ♦ తోషంబు సంత్రాసముం
బూరించెన్విను మేమి చెప్పుదు మహా ♦ పుణ్యాత్మ కుంభోద్భవా. 149

తే. కాశి శివునకు శుద్ధాంత ♦ కాంతగాన, దానిపై నల్గి కోపపా ♦ త్రంబు నైతిఁ
గాశి గౌరికి సవతియౌఁ ♦ గాన నేను, దానిపై నల్గి ప్రేమపా ♦ త్రంబునైతి. 150

వ. అనంతరంబ యేము ప్రత్యుత్థానంబు చేసి యా పురాణదంపతులకుఁ బ్రణామంబులా చరించి మడిసందులం జేతులిడి యొక్కకెలన నిలిచి యుండితిమి. పార్వతీపరమేశ్వరులు వేదికాస్థలంబున విజయంచేసి కూర్చుండి రప్పుడు శంభుండు కోపసంరంభంబున నాదిక్కు చూచి ధిక్కరించి యిట్లనియె. 151

## శంభుండు వ్యాసునిశిష్యులతోడఁ గాశి వెడలిపొమ్మనుట.

సీ. ఓరి దురాత్మ! నీ ♦ వారముష్టింపచా-భాస! యోజనగంధి ♦ ప్రథమపుత్ర!
దేవరన్యాయదు ♦ ర్భావనాపరతంత్ర! బహుసంహితావృథా ♦ పాఠపఠన!
భారతగ్రంథగుం ♦ భనపండితంమన్య! నీవా మదీయప ♦ త్నికి నశేష
కైవల్యకల్యాణ ♦ ఘంటాపథమునకుఁ-గాశికాపురికి ని ♦ ష్కారణంబ
తే. శాపమిచ్చెద సని యనా ♦ చారసరణి, నడుగువెట్టినవాఁడవ ♦ హంకరించి
పొమ్ము నిర్భాగ్య మాయూరి♦పొలము వెడలి, యెచటికేఁ శిష్యులును నీవు♦నీక్షణంబ.

క. పోక నడగొట్టితేనియు, రాకింతుఁ జుమీ మొగంబు ♦ రాచట్టుపయిం
శ్రీకాశిక నిందించిన, నీకెంతట నేలపోవు ♦ నీచచరిత్రా. 153

క. వడి విడువక యివ్వడువున, నుడుపతిమకుటుండు చెవుల ♦ కొసరని నుడుగుల్
నెడవిన నే నయ్యిరవుర, యడుగులఁ బడి కాశి వెడలి ♦ యరిగెదు వేళఁ. 154

చ. వెఱవకుమో కుమార! పది ♦ వేలవిధంబులనైన నిన్ను నే
మఱవ మ కేడకుం జనుట ♦ మాని సుఖంబున దక్షవాటికఁ
దుఱఁగలి గొన్న సమ్మదము ♦ తో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేనివేల్పు నిఖి ♦ లాభ్యుదయంబులు నీకు నయ్యెడుఁ. 155

వ. అనిన నంబవచనంబులు విని విశ్వేశ్వరదేవ రచితన్యక్కారమహోపద్రవసంభూత వేదనాదూయమాన మానసుండనయ్యును భవానీకృపాపాంగవీక్షావిక్షేపదాక్షిణ్యంబున నొక్కింత యంకిలిదెలిసి శిష్యసహితుండనై యెన్నఁడెన్నఁడు భీమేశ్వరుఁ దర్శింతునో యని యువ్విళ్ళూరి యేతెంచుచున్నవాఁడఁ బరమమాహేశ్వరుండవైన నిన్నుం గనుంగొంటి నింక నామనోరథం బవ్యాహతగతిం బ్రవర్తింపఁగలయది. 156

తే. అనవధానత నావగిం ♦ జంతసూవె, పర్వతంబంత యపరాధ ♦ భరముకోలిపి
కాశివెడలంగ మొత్తినఁ గాసిబొంది, తిరుగుచున్నాఁడ నిదెయేను ♦ దిక్కుమాలి. 157

తే. కడుదయాళురు దేవతా ♦ గణములెల్లఁ, గాలభైరవు చిత్తంబు ♦ కఠినపాక
మీరసము పెద్ద దుంఠివి ♦ ఘ్నేశ్వరునకుఁ, గాశిమనఁబొంట్లకెల్లను ♦ గానిబ్రతుకు. 158

క. అని కుంభసంభవునకును, దన వృత్తాంతంబు చెప్పి ♦ దైన్యము నొందెన్
గనుగవ నశ్రులుదొరఁగఁగ, ననఘుఁడు సత్యవతిసూనుఁ ♦ డని చెప్పటయున్. 159

వ. అటమీఁది వృత్తాంతం బెయ్యది యని యడిగిన. 160

మ. స్మరజిద్భూధరదిక్కరిద్రుహిణయో ♦ షాచంద్రికాభ్రాపగా
శరదభ్రాభ్రిభ్రిమువల్లభప్రతిభట ♦ స్ఫాయస్ఫురత్కీర్తిని
ర్ఝరగర్భోదయభూర్భువస్స్వరఖిల ♦ బ్రహ్మాండభాండోదరా!
యరివేదండఘటావిఘట్టనకఠో ♦ రాటోపకంఠీరవా! 161

క. అనమనమవిషమసమర, ప్రసృమరరిపు సుభటనిటల ♦ పట్టవిఘట్ట
వ్యసనదృఢదోఃకఠారా, కుసుమశరాసనసమాన ♦ కోమలమూర్తీ 162

స్రగ్విణీ. రామమాంబాసుతా ♦ రాజవిద్యాధరా
కామితార్థైకసం ♦ కల్పకల్పద్రుమా
వేమసత్క్షోణిభృ ♦ ద్వీరభద్రేశ్వరా
స్వామికార్యాభిర ♦ క్షాక్రియాదక్షిణా. 163

గద్య. ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథ
నామధేయ ప్రణీతంబైన భీమేశ్వరపురాణం బను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీభీమేశ్వరస్వామినేనమః.

# శ్రీ భీ మే శ్వ ర పు రా ణ ము.



## తృ తీ యా శ్వా స ము.



భీమేశ్వరకరుణా
లాభసముజ్జృంభమాణ ♦ లక్ష్మీవిభవా
ప్రాభవకశ్యపమునివం
శాభరణా! బెండపూఁడి ♦ యన్నామాత్యా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పందొడంగె. 2

గీ. అవ్విధంబున బాప్పధా ♦ రావలాత్ముఁ, డగుచు సత్యవతీసూనుఁ ♦ డడలుటయును
నెలఁతయును దాను గన్నుల♦నీరునించెఁ, గరుణ చిత్తంబులో నుబ్బఁ♦గలశభవుఁడు. 3

వ. అనంతరంబ యంతరంగంబున సంతాపంబు డిందుపఱచుకొని సత్యవతీనందనుండు
కమండలుజలంబులు కన్నులం దడుపుకొని నిట్టూర్పు నిగుడించి కాశికావియోగక్లేశం
బున సమానవ్యసనుండైన కుంభసంభవున కిట్లనియె. 4

ఉ. ఈవును నేనపోలెను ము ♦ నీశ్వర భాగ్యము లేమిఁజేసి కా
శీవిరహాగ్నితాపమునఁ ♦ జేడ్పడినాఁడవు చెప్పవయ్య నా
త్రోవ మహాత్మ దక్షపురి ♦ ధూర్జటి శంభుఁడు భీమనాథుఁ డా
ర్యావిభుఁ డాశ్రయార్హుఁడగు ♦ నా?నను నేలికొనందలంచునా? 5

మ. జగతీమాళివతంసభూషణము వి ♦ శ్వఖ్యాతముం గాశికా
నగరంబు న్విడఁబాసి నీకును జగ ♦ న్నాస్యైకచారిత్ర యీ
చిగురుంబోఁడికి నాకునుం గటకటా ♦ చేట్పాటు పాటిల్లె నీ
ముగురిం గూర్చిన ముండదైవమునకున్ ♦ మోమోట లేదో సుమీ? 6

నిండి పాఱుచు నుండు ♦ నే నిదాఘములందుఁ-దలకొత్తు సప్తగో ♦ దావరంబు!
షట్కాలశంభుపూ ♦ జావిధానములకుఁ-బల్లవప్రసవద ♦ ర్భలును గలవె?
కాంతాజనంబులు ♦ కమియార నిడుదురే-పురములోఁ దత్కాల ♦ పుణ్యభిక్ష?
ఘనతపంబునకు వి ♦ ఘ్నంబు సేయరుగదా-యమరేంద్రుఁ డొసఁగిన యప్సరసలు?
తే. కాలభైరవవిఘ్నేశ ♦ కార్తికేయ, వీరభద్రాదిపరివార ♦ వీరగణము
స్వాగతము సేయునే కార్య ♦ సాధకులకు, దక్షవాటికయందు వా ♦ తాపిదమన? 7

ఉ. ముక్కుమొగంబుచూడ కొక ♦ మోసపుమాటకు విశ్వనాయకుం
డెక్కడికైనఁ బొమ్మనుచు ♦ నెఱ్ఱనిచూపులఁ జూచె నల్కతో
ధిక్కరణంబు సేయఁ జను ♦ దెంచితిఁ గాశినినుండి నాకుఁ దా
దిక్కయి భీమనాయకుఁడు ♦ దీర్చునొకో యవమానదుఃఖముల్. 8

తే. నన్ను గన్న తల్లి ♦ యన్నపూర్ణామహా, దేవి విశ్వనాథ ♦ దేవు తరుణి
గుఱుతుచెప్పి తన్నుఁ ♦ గొలువంగఁ బుత్తేర, వచ్చినాఁడ ♦ నేలవలదె తనకు? 9

సీ. భీమేశ్వరేశ్వర ♦ శ్రీమహాదేవుండు-కరుణించునే నన్నుఁ ♦ బరమశైవ!
సప్తగోదావరో ♦ త్సంగధాముఁడు నన్ను-నాదరించునె యిల్వ ♦ లాసురారి!
సప్తపాతాళవి ♦ ష్కంభమూలస్తంభ - మూరడించునెనన్ను ♦ నుపరతాత్మ?
దక్షిణాంభోరాశి ♦ తటమేదినీభర్త - రక్షించునే నన్ను ♦ బ్రహ్మవాది?
తే. స్వాగతముసేయునే నాకుఁ ♦ జంద్రమౌళి, కాంక్షితం బిచ్చునే నాకుఁ ♦ గాళగళుఁడు?
కాశిలోఁ బడ్డ మానభం ♦ గంబువాయఁ, గుస్తరించునె నను శూలి ♦ కుంభజన్మ? 10

ఉ. దోసము పెద్దలేదసక ♦ ధూర్జటి నిష్ఠురకంఠహుంక్రియా
భ్యాసముమై నచల్చి యద ♦ యస్థితిఁ గాశివెలార్చెన్ నింక నే
నా సరిసంయమీంద్రుల స ♦ నాథత నేమెయిఁ జూతు దక్షవా
టీసదనుండు ప్రేమ ఘటి ♦ యింపక తాను నుపేక్షచేసినన్. 11

— కలశభవుఁడు పారాశర్యునకు దక్షారామమహిమంబు చెప్పుట. —

వ. అనినఁ బారాశర్యునకు నత్తపోధనవర్యుం డిట్లనియె. 12

మ. వితతాష్టాదశసంహితాగమకథా ♦ వీథీసహస్రంబు భా
రతతంత్రంబఖిలంబు నీయది యపా ♦ రంబైనయామ్నాయసం
తతి నీచే వివరింపఁగాఁబడియె వి ♦ ద్యావర్ధనా నీవు నీ
క్షితిలోఁ గానని తీర్థముల్ గలవె? యీ ♦ చింతాభరం బేటికిన్. 13

వ. భీమలింగంబు మాహాత్మ్యంబు నీ వెఱుంగనియదియునుం గలదె? దక్షారామపుణ్య
క్షేత్రం బఖిలపురాణప్రసిద్ధంబు కాదె? నీమనోవిషాదంబు సంజేసి యెఱుంగనివాఁడ
వుంబలె నడిగెదవుగాక, యైన నడిగిన యర్థంబు చెప్పెద నాకర్ణింపుము. 14

ఉ. మోక్షస్థానము భోగభూమియును నై • మున్నూఱుతీర్థంబులన్
సాక్షాద్బ్రహ్మపదంబనంగ నపర • స్వర్గంబునా నొప్పగున్
దక్షారామము భీమనాయకమహా • ధామంబు లోకత్రయీ
చక్షుఃప్రాఘుణకాయమానసుషమా • సంపత్సముద్దామమై. 15

తే. రాజవంశజుఁడగు భగీ • రథుని వెనుకఁ, బాఱు తెంచిన చదలేఱు • పాటియగునె
సప్తమునిరాట్ప్రతాపసం • ప్రాప్తమైన, సప్తగోదావరంబుతో • సారమహిమ.

సీ. దక్షప్రజాధినా • థమహాధ్వరక్రియా, దీక్షాధిగమపుణ్య • దేశమునకు
బ్రహ్మవిష్ణుపురంద • రప్రధానసుపర్వ - పరమసంయమిసభా • భవనమునకు
దాక్షాయణీయోగ • దహనార్చిరుత్క్షేప - సామిధేనీమంత్ర • జాతమునకు
వీరభద్రభుజావి • హారహేలాసమా - రంభనాటకనాట్య • రంగమునకు

తే. నమృతమయదివ్యతేజస్స్వ • యంభులింగ, శాంతభీమేశ్వరేశ్వర • స్థానమునకు
దక్షవాటంబునకు మోక్ష • ధామమునకు, భోగజన్మస్థలమున కే • పురము సరియె!

వ. వెండియుఁ జండభానుకృతప్రతిష్ఠుండును, నాఖండలముఖనిఖిలబర్హిర్ముఖశిఖామణి
మయూఖకిర్మీరితచరణారవిందుండును, సప్తపాతాళభువనవిష్కంభనిర్భేదసమాసా
దితావిర్భావుండును, దివ్యామృతస్వయంభూరుజ్జ్యోతిర్లింగమయమూర్తిధరుండు
నైన, భీమేశ్వరుండు భోగమోక్షప్రదాన దీక్షాధురంధరుండై యందు వసించియుండు
నమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు భీమమండలంబనఁ బండ్రెండు యోజనంబులమేర
కైవల్యకల్యాణ మండపంబును భోగలక్ష్మీవిలాస భవనపుండరీకంబును నై కుండలాము
ఖసంవేద్యశార్దూలతీర్థంబులు మొదలుగాఁ గల శాఖోపశాఖాతీర్థంబులం గలిగి
దక్షిణజలధివేలావనోపకంఠంబున వేదండవదనశుండాకాండచుళికితోన్ముక్తసప్తగో
దావరసలిలధారాఘుణత్కారబృంహిత బ్రహ్మాండగోళంబును, దుల్యభాగాప్రవాహ
లహరికాఘోషఘుమఘుమాయమానదిగ్విభాగంబును, నేలానదీమాతృకాయమానకే
దారక్షేత్రసంవర్ధితానేకవ్రీహిభేదసంపత్సంపన్నంబును, ఫలభరితనారికేళషండమం
డితప్రౌఢపీఠాపురోపకంఠసీమాబహిర్భాగంబును, మాతృకాయమాన గోదావరీతీర
పుణ్యాగ్రహార సరంపరాభూనిలింప సంపత్సంపాదితాధ్వరక్రియాసమాహూతపురు
హూతాదిదేవతాకదంబ సంబాధసంచరితంబును, గాంతేయవాహినీప్రాంతసంతప్య
మానసహకారకాంతారఫలరసాస్వాదమోదమానపుంస్కోకిలకుటుంబకంఠనాళకోమ

లకుహూకారకోలాహలప్రపంచితపంచమంబును, హరివంశంబునుంబోలె బలభద్రప్ర ద్యుమ్నానిరుద్ధపురుషోత్తమాధిష్ఠితంబును నై, మహాక్షేత్రంబన, మహాలింగస్థానంబన, దక్షిణకాశియనఁ, గళ్యాణనిలయంబనఁ, గైలాసప్రతిబింబంబన,నశ్వరమహైశ్వర్యం బును, నప్రతిమవైభవంబును, నవాఙ్మానసగోచరంబును, నసంఖ్యాతప్రమథగణసమా కీర్ణంబును నై, యశేషకల్యాణనిలయం బై యొప్పునమ్మహాస్థానంబునందు. 18

సీ. పాటలంబగుజటా ♦ జూటంబునడునట్టు-పూపచుక్కలరాజు ♦ పొడవుచూపు
వెడఁద యైన లలాట ♦ వీథివిటంకంబు-కట్టెఱ్ఱకొవ్వేఁడి ♦ కన్నుఁగూర్చుఁ
గంబుసన్నిభ మైన ♦ కంఠప్రదేశంబు-గరళకూటముఛాయఁ ♦ గ్రాఁచి యుంచియుఁ
గడు మనోజ్ఞము లైన ♦ కర్ణపార్శ్వంబులఁ-బెనుపాఁపపోఁగులు ♦ బిత్తరించు
తే. భీమమండలికాపుణ్య ♦ భూమియందు, వివిధకైవల్యకళ్యాణ ♦ వేది నసఁగఁ
గీటపక్షిసరీసృప ♦ క్రిమిచరాది, జంతుకోటికిఁబ్రాణావ ♦ సానవేళ. 19

సీ. ఒకచోటఁ గోటివ ♦ ల్ల్యుఁడురాజకోటీర-విభ్రాజితోత్సంగ ♦ వృద్ధగంగ
యొకచోటఁ బీఠాంబి ♦ కోన్నతస్థనభర్మా-స్ఫాలజర్జరితక ♦ ల్లోలయేల
యొకచోటఁ జటులన ♦ క్రకుళీరపాఠీన-తోయగర్భాభోగ ♦ తుల్యభాగ
యొకచోటనప్సరో ♦ నికరసంసేవితాం-తరముక్తీశసప్తగో ♦ దావరంబు
తే. నమరు నాగరఖండసి ♦ ద్ధాంతజాతి, నాగవల్లీసమాక్రాంత ♦ పూగఖండ
మండితోద్యానవాటికా ♦ ఖండవిభవ, పాత్రి మగుభీమమండలీ ♦ క్షేత్రమునకు. 20

సీ. త్ర్యంబకాచలశిఖా ♦ గ్రమునందునుదయించి-పొదలి యార్యావర్త ♦ భూమిదఱిసి
మలఁగిదండకవనీ ♦ మధ్యభాగముననా-ప్రస్రవణాచల ♦ ప్రస్థమొఱసి
పట్టిసశ్రీవీర ♦ భద్రేశుసేవించి-తీరసోమేశుమం ♦ దిరముడాసి
యేచియనంతభో ♦ గేశ్వరస్థానంబు-రుద్రపాదములపైఁ ♦ ద్రోవగాఁగఁ
తే. గోటిపల్లీశు కోమలాం ♦ ఘ్రిలకుమ్రొక్కి, కుండలాముఖతీర్థంబుఁ ♦ గుస్తరించి
భీమమండలి డాపలఁ ♦ బెట్టుకొనుచు, గౌతమీగంగ లవణాబ్ధి ♦ గౌఁగిలించె. 21

తే. నీరుకడఁగోల్లఁగూడిము ♦ న్నీటిఁగవయు, మొగులుబడివాహినులకెట్లు ♦ మొరయవచ్చు
వార్థులేఁడింటికివలపు ♦ వనితయైన, మంగళోత్సంగగౌతమీ ♦ గంగయెదుర. 22

ఉ. ఎక్కడఁ జూచినం సరసి ♦ యెక్కడఁ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని ♦ యెక్కడఁ జూచినఁ బుష్పవాటికం
బెక్కడఁ జూచిన న్నది మ ♦ హీవలయంబున భీమమండలం
బెక్కడ నయస్యమండలము ♦ లెక్కడ భావన చేసి చూచినన్. 23

తే. బ్రహ్మహత్యాదులగు మహా ♦ పాతకములు, ధాత్రి జనులకు నిమిష మా ♦ త్రమునఁ బాయు
భీమనాథమహాదేవు ♦ పెండ్లినాఁటి, దక్షిణాముఖమండప ♦ దర్శనమున. 24
తే. కార్తికీవేళ భీమశం ♦ కరునినగరఁ, దూఱు నెవ్వాఁడు చిచ్చుఱ ♦ తోరణంబు
వాఁడు దూఱఁడు ప్రాణని ♦ ర్యాణవేళ, ఘోరయమపట్టణద్వార ♦ తోరణంబు. 25
తే. ద్వాదశక్షేత్రపుణ్యతీ ♦ ర్థములతోడ, రమ్యమగుసప్తగోదావ ♦ రంబుతోడ
వరదభీమేశ్వరేశ్వరా ♦ వాసమైన, దక్షవాటంబుకళ్యాణ ♦ ధామమమరు. 26
తే. అప్పురంబుప్రభావంబుఁ ♦ జెప్పనేల, తిరిగిపాఱుంగయోజన ♦ త్రితయభూమి
వాపికాకూపగర్తప ♦ ల్వలతటాక, తీర్థజలములుభాగీర ♦ థీజలములు. 27
సీ. పంచాక్షరీమంత్ర ♦ పారాయణంబులు-జపియించు శారికా ♦ సముదయములు
నీలకంఠస్తోత్ర ♦ కోలాహలప్రౌఢిఁ-జూపు నున్మత్తపుం ♦ స్కోకిలములు
శతరుద్రసచ్ఛ్రుతి ♦ స్వాధ్యాయపాఠంబుఁ-బఠియించుఁ గిశోర ♦ బంభరములు
ప్రణవాక్షరాభ్యాస ♦ పరిపాటిఁ బాటించు-నానావిధంబుల ♦ నమిలిపిండు
తే. సప్తగోదావరంబుని ♦ ర్ఝరసహస్ర, సారణీసేకసాంతత్య ♦ సంప్రవృద్ధ
వివిధతరుగుల్మవల్లికా ♦ వేలమైన, తత్పురోద్యానవీథికాం ♦ తంబునందు. 28
సీ. నిఖిలపుణ్యక్షేత్ర ♦ నివహంబునందును-నత్యంతమాశ్రయం ♦ బనఁగ నెగడి
యైంద్రసంపదకెల్ల ♦ నాధారభూతమై-దక్షునియజ్ఞంబు ♦ తానకమయి
ద్వాదశపుణ్యతీ ♦ ర్థములతో సంధిల్లి-భోగమోక్షవిహార ♦ భూమి యగుచు
నియమయాత్రామాత్ర ♦ నిశ్శేషదోషాఘ-హరణం బొనర్పస ♦ మర్థమగుచు
తే. సిద్ధనిర్మలనిరవధి ♦ శ్రీస్వయంభు, ధన్యభీమేశ్వరేశ్వర ♦ స్థాణులింగ
దైవతస్థితిసంభవ ♦ స్థానమైన, దక్షవాటంబు వర్ణింపఁ ♦ దరమె మనకు. 29
క. దక్షిణకాశీనగరము, దక్షారామంబు భీమ ♦ ధామము ధన్య
త్వక్షితిక్షోణీమండల, రక్షామణి దానిఁ బొగడ ♦ బ్రహ్మకు వశమే. 30
సీ. భీమేశ్వరేశ్వర ♦ శ్రీమహాదేవుండు-హిమధామమౌళివి ♦ శ్వేశ్వరుండు
సప్తగోదావర ♦ సలిలప్రవాహంబు-సాక్షాత్కరించిన ♦ జహ్నుకన్య
తిరుపుట్టుమాలెలోఁ ♦ దిరమైనగణపతి-యేకాంతడుంఠివి ♦ ఘ్నేశ్వరుండు
దక్షిణంబుననున్నఁ ♦ దండపాణిశుఁ డూ-హింపంగ దండపా ♦ ణీశ్వరుండు
తే. భైరవస్వామి శ్రీకాల ♦ భైరవుండు, నంది నందీశ్వరుం డేమి ♦ సందియంబు
దక్షవాటంబు కాశికా ♦ స్థలము గాదె, తీవ్రకరతేజ సత్యాన ♦ తీతనూజ. 31
వ. మఱియు భీమేశ్వరమండలమునకు సీమాసంవిభాగంబు. 32

తే. జంభరిపుదిక్కునకు సీమ ♦ సలిలరాశి, పశ్చిమమునకు సీమ త్ర్యం ♦ బకతనూజ
ద్యుమ్నపతిదిక్కునకు సీమ ♦ తుల్యభాగ, దక్షిణమునకు వృద్ధగౌ ♦ తమియె సీమ. 33

తే. భోగమోక్షమహైశ్వర్య ♦ యోగకాంక్ష, భీమమండలిఁ గాఁపుండఁ ♦ బ్రియము పుట్ట
మర్త్యయోనిజనింపంగ ♦ మదిఁదలంత్రు, వివిధగంధర్వకిన్నర ♦ విబుధవరులు. 34

తే. భీమమండలికాపుణ్య ♦ భూమియందుఁ, దేజరిల్లెడు పంద్రెండు ♦ తీర్థములకు
జాతరలు సేయ నప్సర ♦ స్సతులతోడ, నాకమున నుండి యేతెంచి ♦ నముచివైరి. 35

సీ. ఏడురసాతల ♦ క్రోడంబులును విని - ర్భేదించి వెడలిన ♦ పెద్దవేల్పు
మార్తాండుచే నభో ♦ మణిచేత రవిచేఁ బ్ర-తిష్ఠఁ బొందిన మహా ♦ దివ్యమూర్తి
సప్తర్షు లరుదేర ♦ సప్తగోదావరం-బనగాహ్వానము చేసి ♦ నట్టిపోడ
తొలుమామ యగు దక్షు ♦ నెలదోఁటనడుచక్కి - విహరణం బొనరించు ♦ వేడ్కకాఁడు

తే. విశ్వపతి భీమనాథేశ్వ ♦ రేశ్వరుండు, కర్తయై యుండి భోగమోక్షములనిచ్చు
భక్తజనులకు నట్టివై ♦ భవపదంబు, మండనము మేదినికి భీమ ♦ మండలంబు 36

సీ. ఎచ్చోటఁ దాఁ బాసె ♦ నిట్ట్రిరూపముఁ బొల్చి- యతిసాధ్వసంబుతో ♦ నధ్వరంబు
పాటిల్లె నెచ్చోట ♦ భాషావధూటికి-నతిజుగుప్సితమైన ♦ యంగవికృతి
యెచ్చోట ముచ్చిచ్చు ♦ నేడేసినాల్కలు - కొండనాల్కలదాఁక ♦ కోఁతపడియె
నెచ్చోట నులివేఁడి ♦ యెండఁ బండులురాలి - పూషార్కువదనంబు ♦ బోసివడియె

తే. దక్షుఁ డెచ్చోటఁ బొట్టేలి ♦ తల ధరించెఁ, జిందువందయ్యె నెచ్చోట ♦ నిందుఁ డనుచుఁ
జెప్పుదురు వీరభద్రుని ♦ జృంభణంబు, భీమమండలి నుండు పాఁ ♦ బెద్దమునులు. 37

వ. నీవు విశ్వేశ్వరదేవవిరచితావమానమనశ్శల్యంబున డస్సి ఖిన్నుండవై యున్నహాఁడవు; నిన్ను విడిచి పోవుట నాకు నుచితంబు గాదు; నీవు నేనునుం గూడి ద్వాదశపుణ్యక్షేత్రయాత్రాప్రసంగమునఁ గుక్కుటేశ్వరదేవు దర్శింపఁగలవార మీవేళ దక్షారామంబునకు మగిడి పోదము లెమ్మని యతండును దానును, లోపాముద్రయును శిష్యమండలంబునుం గదలి యిష్టాలాపంబులఁ బ్రొద్దుపుచ్చుచుం జనిచని. 38

సీ. తుల్యభాగాతటీ ♦ ద్రుమమండలంబైన-సాంపరాయపురంబు ♦ సరణిఁ బట్టి
చూతాటవీవాటి ♦ శోభమానంబైన - పులుగుర్తిసోమేశు ♦ వలపలించి
యోంకారపురిఁద్రికూ ♦ టోపరిస్థితులైన - హరిహరబ్రహ్మల ♦ నభినుతించి
శిలామహాగ్రామ ♦ సింహాసనస్థున-కురగహారున కెదు ♦ రుండి మ్రొక్కి

తే. యరుగువారు మునుల్ పరా ♦ శరసుతునకు, దక్షవాటిఁ బ్రవేశింపఁ ♦ దగినయట్టి
శుభముహూర్తంబు సనుఁ గాల ♦ శుద్ధి దెలియఁ, దలఁచి కూర్చుండి రొకవివి ♦ క్తస్థలమున.

వ. అప్పుడు కాలశుద్ధి విమర్శించి మైత్రావరుణుండు పరాశరసుతున కిట్లనియె. 40

తే. గార్గ్యసిద్ధాంతమతమునఁ ♦ గాలకలన, శకున మానుట యది బృహ ♦ స్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ ♦ విష్ణుమతము, సర్వసిద్ధాంత మభిజిత్తు ♦ సమ్మత మగు. 41

తే. అసురపురములు సాధించె ♦ నంధకారి, యమరపాథోధి మథియించి ♦ రమరవరులు
దివ్యసింహాసనం బెక్కె ♦ దివిజభర్త, సిద్ధమధ్యాహ్నవేళాభి ♦ జిత్తునందు. 42

వ. ఇంక నొక్క విచారంబు. 43

తే. నాభిమండలమిచ్చోటు ♦ నడుముగాన, భీమమండలికాపుణ్య ♦ భూమి నెల్ల
నిచ్చట నెయుండి వీక్షింత ♦ మే? మునీంద్ర, యాకసం బెక్కి యోగవి ♦ ద్యాబలమున. 44

క. భద్రగతి నేను లోపా, ముద్రయు నిర్నిద్రయోగ ♦ ముద్రాశక్తిం
రుద్రవిహారాలయము న, ముద్రముతోఁ గూడఁ జూతు ♦ మో మునివర్యా. 45

తే. ఇపుడు ఘటికాద్వయం బయ్యె ♦ నినుఁడు పొడిచి, దవ్వు చాలదిచ్చోటికి ♦ దక్షవాటి
కేవలము మంచినడకైనఁ ♦ గీసవెత్తి, రెండు జాములు నిట నూర ♦ కుండ నేల. 46

వ. ఈ యోంకారపురపుణ్యక్షేత్రంబునం ద్రికూటదివ్యభవనవాటంబున మునిసంఘంబుఁ
డునది; మనము సభోమండలంబున కెగసి ముహూర్తమాత్రంబునఁ గన్నులపండువులు
గా భీమమండలిపుణ్యక్షేత్రంబు గనుంగొంద మనుటయుఁ బారాశర్యుండు సబహుమా
నంబుగా సమ్మతించిన. 47

## వ్యాసాదు లాకసంబుననుండి భీమ మండలంబుఁ గనుఁగొనుట.

మ. పరమర్షు ల్భృతరోమహర్షమున లో ♦ పాముద్రయుం దారు సం
బరమధ్యంబున నావహం బను జగ ♦ త్ప్రాణప్రవాహంబుపైఁ
బరిలంఘించిరి భుక్తిముక్తిరమణీ ♦ ప్రత్యగ్రలీలాస్పదం
పరసౌధంబగు భీమమండలము స ♦ ర్వంబున్ విలోకింపఁగన్. 48

వ. ఇవ్విధంబున నావహస్కంధగంధవాహప్రవాహమధ్యంబునఁ దపఃప్రభావావష్టంభం
బునె నిలిచి కుంభసంభవుండు బాదరాయణున కిట్లనియె. 49

సీ. ఆంధ్రభూభువనమ ♦ ధ్యము పుండరీకంబు-సప్తగోదావర ♦ జలము తేనె
బ్రహ్మసంవేద్యాది ♦ బహుతీర్థములు రేకు-లకరులు చారుది ♦ వ్యస్థలములు
నాళంబు లవణాబ్ధి ♦ వేలావిభాగంబు-కళ్యాణభోగమో ♦ క్షములు తావి
దక్షవాటీమహా ♦ స్థానంబు కర్ణిక-హంసంబు భీమనా ♦ యకుఁడు శివుఁడు

తే. గౌతమీసింధుకాంతేయ ♦ కణ్వనదులు, తుల్యభాగయు నేలేఱు ♦ దుమ్మికోనలు
భువనసంభావ్య మైన యీ♦పుణ్యభూమి, యనఘ సంసారతాపశాం♦త్యౌషధంబు. 50

సీ. సర్వంసహకుఁ గాసె ♦ నమకట్టుపుట్టంబు-గగనంబునకు నెల్లఁ ♦ గలువసెజ్జ
యవటంబు మేఘవా♦హనుగంధకరటికి-నభ్యవహారమౌ ♦ ర్వాగ్నిశిఖకు
పంటిల్లు యామినీ ♦ శ్వరకళామాళికిఁ, దరిచోటు నిఖిలబృం♦దారకులకుఁ
గూటకచ్ఛపనాయ ♦ కునకు నిశాంతంబు, మరుజనకునికిని ♦ మనికిపట్టు
తే. ఘనతరోద్దండపాఠీన ♦ కమఠనక్ర, తిమితిమింగిలచక్రవి ♦ క్రమవిహార
ఘుమఘుమారంభ గంభీర ♦ ఘోషఘటిత, లటదిశాప్రతిశబ్దోప ♦ లబ్ధియబ్ధి. 51

సీ. జనమేజయారబ్ధ♦ సర్పాధ్వరాహూత-చక్షుశ్శ్రవస్సహ ♦ స్రములఁ బోలి
బ్రహ్మాండమండల ♦ ప్రాసాదసంభార-హరిమణిస్తంభసం ♦ హతులనంగ
జంభారిదోస్స్తంభ♦ దంభోళిఖండితాం-జనశైలశిఖరపుం ♦ జములఁ బెనఁగి
సంహారసమయఝం ♦ ఝామారుతోద్ధూత-కాలాంబువాహసం ♦ ఘములఁ గెలిచి
తే. యాడుచున్నవి తీండ్రిల్లి ♦ యంబరమునఁ, జేయుచున్నవి త్రిభువనా ♦ శ్లేషకంబు
నబ్జనాభుని తూఁగుటు ♦ య్యాలలుగం టె, వేనవేలు పయోరాశి ♦ వీచిఘటలు. 52

శా. కాశిం జచ్చిన యంత్య గాని పడయం ♦ గారాని కైవల్యమ
క్లేశం బౌనటు వేద్యనాయకుని చే ♦ లీలాగతిం జేర రా
రో శీఘ్రింబున మర్త్యులార యను నా ♦ రూపంబునన్ మ్రోయు నా
కాశాస్ఫాలనగౌతమీజలధిసం ♦ గస్థానకల్లోలముల్. 53

మ. అదె సంవేద్యము; కోటిపల్లి యదె; ద ♦ క్షారామమన్ పట్టణం
బదె; యభ్రంకషసౌధకూటఘనహే ♦ లావాసముచ్ఛ్రాయసం
పద సొంపారెడు భీమలింగము మహా ♦ ప్రాసాదభూమీధరం
బిదె; సప్తర్షి నదీప్రవాహ మిదె; సం ♦ వీక్షింపు మేకాగ్రతన్. 54

సీ. అదె పట్టిసస్థాన ♦ మందుండు వీరభ-ద్రేశ్వరస్వామి య ♦ ర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి ♦ యచట మార్కండేయు-నిలువేల్పు ముక్కంటి♦ వెలసె వొల్లి
యదె కుమారారామ ♦ మాహార్మ్యరేఖయు-చాళుక్యభీమేశు ♦ సదనవాటి
యదె కుక్కుటేశ్వరం ♦ బయ్యుపాంతము మేడ-హుంకారిణీదేవి ♦ యోలగంబు
తే. వాఁడె మాయింటివేల్పు ప♦ ల్లవలపురమునఁ, నుండులింగంబు ఫణిరాజ♦కుండలుండు
సప్తమునిసింధుసంగమే ♦ శ్వరుఁడు వాఁడె, కుండలాముఖ మదె మాని♦కులవరేణ్య.

క. అని చూపి చెప్పి కుంభజుఁ, డినుఁ గనుఁగొని శుభముహూర్త • మిది యేతెంచెన్
మనము దిగవలయు ననుచును, మునిమండలి ప్రోలఁ దిగిరి • ముగురుం ధరకున్. 56

వ. అనంతరంబ కుంభపులినసంభవులు సంబవులు దొడిగికొని కదలి, కదళికారామంబుల రామణీయకంబును, నుల్లసిత బిల్వచిరిబిల్వవిటపంబుల పొల్పును, ద్రాక్షారుద్రాక్షఖర్జూరకేసరసరళపున్నాగనారంగంబులరంగంబును, లవంగలుంగలవలీమల్లీవల్లీమతల్లీవేల్లనంబులయుల్లాసంబును, ఘోంటాకురంటకఝుంటికాకంటకఫలకపిత్థలోధ్రజంబూజంబీరపారిభద్రభద్రదారుశాల్మలీగుల్మ లీలాహేవాకంబు నుద్రేకంబును, గోమలతరతమాలమాలాకారశాకోట విటపిషండంబుల మెండును, జెఱకుమిఱకంబును, బ్రాసంగుమిసిమియుఁ, జెంగల్వతావిరేవయుం, గుసుమవాటిసొసకంబును, నుభయపార్శ్వంబులం గల ఘంటామార్గంబునుగా నెడనెడం గుసుమభారారంభసంభారకుసుమగుచ్ఛచ్ఛాయావిభాసితసంధ్యారాగసరభసంబును, గందియందంబును, బెసరసిరియును, మినుముసలువును, గోధూమ శ్యామాకవరగయును, మాషతోరసముస్నేహంబును, నేసియేపును, ననంతిన కేతనంబును, నువ్వుమవ్వంబును, గుసుత్థసద్ధార్థమానవృద్ధియుఁ, బ్రత్తిసంపత్తియుఁ, బొబ్బరయుబ్బరంబును, నందసందర్భంబును, యవయావనాళప్రియంగుగుసుజతిలపరిస్ఫూర్తియుఁ, దవ్వింఠలసందడియు, గంటెకొఱ్ఱఱుచును, గసగసలివయును, జెంగలించు జాంగలిక్షేత్రంబున నేత్రంబులకు నింపుసొంపునంపాదింప ననంతాంతరాంతరంబులు, తరతరంబు తరళతరతరంగరింఛోళికాంచలంబులం జెంగులం దువాళించుచు నతిశిశిరసలిలశీకరనికర నిరతకరణపరిణతింగొల్పి పోల్క్షమోఁకల పూవుఁబాలల నెత్తావికిం దావలంబులై కేవలంబుపొలయు సప్తగోదావర సమీరణంబులు నాసికా పుటకుటీరంబులకుఁ గుటుంబకంబుగా మందమందగమనంబున నహిమకరబింబం బంబరవీథీసౌధకూటంబున హాటకకలశభంగినంగీకరించుకొలఁది నభిజిద్వేళ వేలావనోపకంఠకంఠాలంకారహారధామంబైన దక్షారామంబుఁ బ్రవేశించి రంత. 57

## వ్యాసాదులు దక్షారామంబుఁ బ్రవేశించుట.

క. ఇటు కృష్ణద్వైపాయన, ఘటజన్ములు భీమనాయ • కస్వామిమహా
కటకము ముక్తివధూటీ, కటకాభరణంబుఁ జొచ్చి • కడు వేడుకతోన్. 58

తే. కర్ణికారాంబికామహా • కాళిగుడికి, నందముగ నూలుపట్టిన • యట్టిచాయ
సూర్యవీథికిఁ జనిరిసం • శుద్ధమతులఁ, బశ్చిమద్వారమునకునై • పరమమునులు. 59

వ. అప్పుడు ఘటోద్భవుం డమ్మహాస్థానంబు సత్యవతీసూనునకుఁ జూపి వెండియు నిట్లనియె.

సీ. లీలావిలాసలా ♦ లితలోకహర్మ్యంబు - గోమేధికాక్లృప్త ♦ గోపురంబు
గోపురస్థితశాత ♦ కుంభకుంభశతంబు - దివ్యరత్ననిబద్ధ ♦ దేవగృహము
దేవగేహాకీర్ణ ♦ దివిజాప్సరశ్శ్రేణి - యఖిలవస్తుప్రపూ ♦ ర్ణాపణంబు
వివిధాపణస్వర్ణ ♦ వేదికాధ్యాసిత - యక్షగంధర్వవి ♦ ద్యాధరంబు
తే. శంఖభేరీమృదంగని ♦ స్స్వాణపటహ, ఝల్లరీవేణువీణాది ♦ శబ్దనివహ
కలకలోద్వేజితాశేష ♦ కల్మషంబు, నయనభాగ్యంబు దక్షిణా ♦ నందనవనము. 61

సీ. ఘల్లుఘల్లనిరత్న ♦ కంకణంబులు మ్రోయ - గంధవాహునియాలు ♦ కసవునూడ్చు
లక్ష్మి కెంగేలిలీ ♦ లారవిందమ్మునఁ - గలయంపిచిలికించుఁ ♦ గమ్మఁదేనెఁ
ద్రామపర్ణియుఁ దాను ♦ తారకాపథగంగ - వలిముత్యములరంగ ♦ వల్లిఁదీర్చు
నధివాసమును జేయు ♦ యముని శుద్ధాంతంబు - ధూపార్తిమహిసాక్షి ♦ ధూమఘుటిక
తే. సప్తపాతాళనాగేంద్ర ♦ చంద్రముఖులు, ఫణమణిజ్యోత్స్న దివియగం ♦ బన్ను లగుదురు
సోమమకుటుని గారాబు ♦ జోటిరైన, దక్షవాటికఁ బ్రతిమహో ♦ త్సవమునందు.

మ. ధనకోటీవినిబద్ధకేతనశత ♦ ద్రాఘిష్ఠ వైశ్యాలయం
బను వేలధ్వనితార్థదానవిధిఘుం ♦ టూరావవేశ్యాగృహం
బనిమేషాక్షినిరీక్షితేశ్వరమహో ♦ ద్యత్కోణి బృందారకం
బనుసంధ్యాగతలోకపాలకము ద ♦ క్షారామ మభ్యున్నతిన్. 63

తే. మొగులుముట్టిన సురసద్మ ♦ మూర్ధవీథిఁ, గోటిపడగలఁ బొలుపారుఁ ♦ గూటకోటి
పట్టణమ్ము నిజాంగుళీ ♦ పల్లవముల, నెట్టుకొని పాపములఁ బాయుఁ ♦ దట్టుకరణి. 64

సీ. ఎచ్చోటతీర్థంబు ♦ లేఁ కారుజనుల కి-చ్ఛామాత్రభోగమో ♦ క్షప్రదములు
కీర్తింతు రెద్దాని ♦ కీర్తి గంధర్వులు - గాంధర్వమున యక్ష ♦ గానసరణి
జంకించు నెద్దాని ♦ శబలసౌధోపరి - ధ్వజపటంబులు దేవ ♦ తాగృహముల
వసియింతు రెద్దాస ♦ వాలఖిల్యాదులు - తపసులష్టాశీతి ♦ దశశతములు
తే. నెద్దియమరేంద్రుపురలక్ష్మి ♦ కింతపెద్ద, యట్టిశ్రీదక్షవాటీమ ♦ హాపురంబు
నద్భుతంబందిచూచిరి ♦ యాదిమునులు, సత్యవతినందనుఁడు గుంభ ♦ సంభవుండు. 65

సీ. దక్షాధ్వరానల ♦ త్రయతీర్థ మొక్కటి - యోగాగ్ని నెందేని ♦ నురిసెగౌరి
యఖిలేష్టసంసిద్ధి ♦ యందు రెండవతీర్థ - మెందేని నుమ గాంచె ♦ నిష్టసిద్ధి

సోమేశ్వరం బంద్రు ♦ సారిది మూఁడవతీర్థ-మొందేని నఘము లిత్త్రింకులింకు
హైమవతం బందు ♦ రదినాలుగవతీర్థ-మెందేని హిమవంతుఁ ♦ డొందెవరము

తే. సప్తగోదావరంబు పం ♦ చమసుతీర్థ, మఖిల శుభములు నెందేని ♦ నావహిల్లుఁ
బంచతీర్థంబు లివి యాడి ♦ పంచజనుఁడు, పాయుఁ బంచేంద్రియోద్భవ ♦ పాతకములు

గీ. శిష్టమునిలోక విబుధాభి ♦ సేవ్యమైన, యిమ్మహాతీర్థములశక్తి ♦ నేమి చెప్ప
వానిపైఁబాఱి వెడలెడు ♦ వాయువేని, జీమకైనను గైవల్య ♦ సీమ నొసఁగు. 67

వ. అని దక్షారామ మహాత్మ్యంబు వర్ణింపుచుఁ బ్రదక్షిణక్రమంబున భీమేశ్వరుదివ్యమం
దిరంబు వలపలించి సప్తగోదావరంబునకు డిగ్గి కృతస్నానులై రప్పుడు సాత్యవతే
యుండు కుంభసంభవునకిట్లనియె. 68

తే. ద్వాదశక్షేత్రశివలింగ ♦ దర్శనంబు, మొదలఁ జేయంగవలయుట ♦ ముఖ్యపక్ష
మానతీఁదగు నాకు నీ ♦ వానుపూర్వి, శంభులింగంబు లవియెవ్వి ♦ కుంభజన్మ. 69

క. ఇటముష్న దక్షవాటీ, కటకంబునయందుఁ బెద్ద ♦ కాలంబువసిం
చుటఁ దీర్థంబులు నీకుఁ, ఘటసంభవ యాడినవియె ♦ కావెతలంపన్. 70

వ. అనిన విని యగస్త్యుండు సాత్యవతేయున కిట్లనియె. 71

తే. పూర్వజన్మకృతంబైన ♦ పుణ్యరాశి, పాకదశఁ బొందు నెప్పుడ ♦ ప్పాటఁగాని
సకలసంసారదురితని ♦ స్తారమైన, శివకథాగోష్ఠిచెవులకుఁ ♦ జెలువుగాదు. 72

వ. అని పలికి సత్యవతీసూనునకుఁ గుమారవక్త్రింబునఁ దాను విన్నప్రకారంబున మైత్రా
వరుణుండు ద్వాదశతీర్థమాహాత్మ్యంబు నిట్లని చెప్పందొడంగె. 73

సీ. ఇంద్రేశతీర్థంబు ♦ ఋషిసమాకీర్ణంబు-సిద్ధేశ్వరము సర్వ ♦ సిద్ధికరము
యోగీశతీర్థంబు ♦ యోగలక్ష్మీదాయి-కాశీశ్వరము భక్త ♦ కల్పతరువు
శమనేశతీర్థంబు ♦ శాంతిదాంతివిధాయి-వీరభద్రేశంబు ♦ విశ్వనుతము
బ్రహ్మేశతీర్థంబు ♦ బ్రహ్మర్షిసేవ్యము-ప్రైశ్వర్యదము కపా ♦ లేశ్వరంబు

తే. కుక్కుటేశంబు కాశికిఁ ♦ గొంతవెలితి, సోమనాథేశ్వరము ముక్తి ♦ సూచకంబు
శ్రీమహేశ్వరతీర్థంబు ♦ శివునిమెచ్చు, త్రిభువనాభ్యర్చితం బుమా ♦ తీర్థమనఘ. 74

క. గూఢములు నిగూఢంబులు, గూఢాగూఢములు నగుచుఁ ♦ గోటుల సంఖ్యల్
గాఢమహేశ్వరభక్తిని, రూఢిం దీర్థములు గలవు ♦ రుద్రునివాటిన్. 75

తే. గరుడగంధర్వయక్షకి ♦ న్నరులచేత, దివిజఖేచరదైత్యదా ♦ నవులచేత
ద్వాదశక్షేత్ర తీర్థమ ♦ ధ్యంబునందు, భక్తి శివలింగకోటి ని ♦ ల్పంగఁబడియెఁ 76

క. ద్వాదశతీర్థకపరివే, షోదరమున భీమనాథుఁ ♦ డుజ్జ్వలతేజః
ప్రాదుర్భావుం డొప్పగు, నాదిత్యుఁడు పరిధినడుమ ♦ నమరెడుభంగిన్. 77

తే. ద్వాదశక్షేత్రవికచప ♦ త్రములతోడి, దక్షవాటిక యనెడి కెం ♦ దమ్మివిరికి
సప్తగోదావరంబుని ♦ ర్ఝరము తేనె, నడుమ రాయంచ శ్రీభీమ ♦ నాయకుండు. 78

తే. భైమమీశానలింగం బ ♦ పారతేజ, మక్షయం బప్రధృష్యం బ ♦ నాదినిధన
మమ్మహాజ్యోతిరత్నదీ ♦ పాంకురంబు, కనకగర్భాండభవనవి ♦ ష్కంభమునకు. 79

చ. అమృతపయోనిధానమున ♦ యందుదయించెఁ గళానమృద్ధిఁ ద
న్నమర సుధాకరుండు నిజ ♦ మారఁగఁ జూచిన దక్షవాటికా
రమణుఁడు భీమనాయకుఁడు ♦ రాజశిఖాభరణుండు గానినాఁ
డమరమునీంద్రసంఘముక ♦ రాంబుజముల్ మొగడంగ నేర్చునే. 80

తే. విమలపాథోధిఁ బుట్టిన ♦ యమృతమూర్తి, భీమనాథుఁడుమా స్వామి♦ కేమిచోద్య
మహరహంబును బాదసే ♦ వానురక్త, భక్తజనలోకభవరోగ ♦ భంజనంబు. 81

తే. భీమనాథునిఁ ద్రిభువన ♦ స్వామినాథుఁ, బార్వతీనాథు శశ్వత్కృ♦పాసనాథు
దక్షవాటాధినాథు వే ♦ దత్రయైక, నాథునానాథుఁగొలుతు శ్రీ♦ నాథునాథు. 82

సీ. భవు భవానీభర్త ♦ భావసంభవవైరి-భవరోగభంజను ♦ ఫాలనయను
భోగప్రదుని భోగి ♦ భోగిరాజవిభూషు, భూనభోభివ్యాప్తు ♦ భువనవంద్యు
భగవంతు భర్గుని ♦ భసితాంగరాగుని-భానుకోటిప్రభా ♦ భాసమాను
భాగీరథీమౌళి ♦ భగదృగ్విపాటను-భూరథాంగుని భద్ర ♦ భూతిధరుని
తే. భామినీసువిలాసార్ధ ♦ వామభాగు, భక్తితోడభజింపరో ♦ భవ్యమతులు
భావనాభాజులకతండు♦ఫలము లొసఁగు, భాగ్యసౌభాగ్యవైభవ♦ప్రాభవములు.

క. తేజితవిష్ణువిశిఖుఁ, దేజగిప్రదు దక్షవాటి ♦ తీర్థైకమహా
రాజాధిరాజరాజును, రాజకళాధరు భజింప ♦ రారో విబుధుల్. 84

క. రారో ప్రియశుద్ధాంతవ, రారోహానహులు విబుధు ♦ లంబుజహంస
క్షీరామలదేహుని ద, క్షారామపురీనివాసు ♦ నభవునిఁ గొలువన్. 85

ఉ. నందివినాయకాదిగణ ♦ నాథులు గూడి ధృతాస్త్రశస్త్రులై
యెందఱు పాలెముందురు మ ♦ హీధరకన్యకు సావధానులై
నందివినాయకాది గణ ♦ నాథులు గూడి ధృతాస్త్రశస్త్రులై
యందఱు పాలెముందురు మ ♦ హాప్రభుపీటికి దక్షవాటికిన్. 8

సీ. భానుమండలములు ♦ పండ్రెండునుదయించి-కరపాళిబిట్టెండ ♦ గాయకుండ
సంరంభమున నేడు ♦ ఝంఝూనిలంబులు-వెగ్గలం బగు మోఁత ♦ విసరకుండఁ
బుష్కలావర్తకం ♦ బులు లోనుగాఁగల-కొఱ్ఱమేఘములు వృష్టి ♦ గురియకుండఁ
బరపి లంఘించి స ♦ ప్తమహార్ణవంబులు-విన్నందిపెనువెల్లి ♦ విరియకుండ
తే. నాజ్ఞవెట్టించుఁ బ్రమథనా ♦ యకులచేత, విశ్వపతి యైన భీమేశ్వ ♦ రేశ్వరుండు
దక్షవాటికి నాత్మీయ ♦ స్థానమునకు, నవహితస్వాంతుఁ డగుచుఁ గా ♦ లాంతవేళ.

తే. భైరవుం డర్ధరాత్రంబు ♦ ప్రహరిఁ దిరుగుఁ, బాయకుండును నడురేయి ♦ ప్రమథగణము
గవనికాపులవారుది ♦ క్పాలవరులు, దక్షవాటికి భీమేశు ♦ ధామమునకు. 88

వ. అని ప్రసంగించి శివలింగార్చనాపరాయణుండైన మైత్రావరుణుండు త్రిలింగవిషయ
మంగళాలంకారంబగు భీమేశ్వరమండలంబునఁ బండ్రెండుశివలింగస్థానంబులు వివరిం
చువాఁడై యిట్లనియె. 89

తే. ఉత్సవం బుత్సవము దప్ప ♦ కుండసురలు, వత్తు రౌత్సుక్యమున దక్ష ♦ వాటమునకు
శాంభవీశక్తి మర్త్యవే ♦ షంబు దాల్చి, భీమలింగంబుఁ ద్రిభువన♦ స్వామిఁ గొలువ.

క. తాండవమాడుఁ గుమారశి, ఖండి మహోత్సవము వేళ ♦ గంభీరములై
డిండిమనిర్ఘోషంబులు, పండువుపండువున నుఱుము ♦ భంగి వహింపన్. 91

తే. మర్త్యభామలు విబుధ♦భామలును గలసి, యుత్సవములందు వర్తింపు♦చున్న యపుడు
దక్షవాటంబు వీట భే ♦ దంబు దెలియు, దృష్టిమేషానిమేషప్ర ♦ దీప్తివలన. 92

శా. అర్కేందూపలరత్ననిర్మితమహా ♦ హర్మ్యాగ్రభాగంబులం
దారోహన్ తారక మండలంబుగని ము ♦ గ్ధస్త్రీలు రేలప్పురిం
గర్కంధూఫలసన్నిభంబయిన ము ♦ క్తాజాలమన్ చింతచేఁ
దర్కింపం దిలకించి నవ్వుదురు గం ♦ ధర్వాంగనా పల్లవుల్. 93

తే. దక్షమునిరాజు సంతరు ♦ ద్యానవనము, దక్షవాటంబు శివుని యుత్తమపురంబు
బహుళకైవల్యఫలధర్మ ♦ పాదపంబు, దీనిఁ గాతురు చుట్టును ♦ దిరిగి సురలు. 94

తే. గౌరి యొక్కతె యాకాశ ♦ గంగయొకతె, కాశి యొక్కతె దక్షిణ ♦ కాశి యొకతె
నలుగురును శంభునకు లోక ♦ నాయకునకు, రాణివాసంబు లనురాగ♦ రసముపేర్మి.

వ. ఒక్క సమయమ్మున దక్షారామమున కేతెంచి భీమమండలంబునందు. 96

క. శోభనముహూర్తమున భుజ, గాభరణుఁ బ్రతిష్ఠచేసి ♦ యర్చించి మహా
వైభవమొనర్చి పొందె మ, నోభిమతము విబుధనాథుఁ♦ డధికస్ఫురణన్. 97

తే. దేవతాభర్త శంభుప్ర ♦ తిష్ఠ చేసి, సురగణంబుల లోకపా ♦ లురను జూచి
యనియె మీరును భీమనా ♦ యకుని వీట, సిద్ధశివలింగములఁ బ్రతి ♦ ష్ఠింపవలయు.

— ఇంద్రుఁడు దేవతలకు శివలింగమాహాత్మ్యంబుఁ జెప్పుట. —

సీ. శ్రీకంధరుని బ్రతి ♦ ష్ఠించు నెవ్వఁడు వాఁడు-పాపియైనను శంభు ♦ పదముఁ గాంచు
శివలింగపదయాత్ర ♦ శివలింగసంవీక్ష-శివలింగసంస్పృష్టి ♦ శివసమర్చ
నాకలోకాధి రా ♦ జ్యైకకారణములౌ-నయమార సాధార ♦ ణస్థలములఁ
గళ్యాణభోగమో ♦ క్షనివాసమైనయీ-దక్షవాటీపుర ♦ స్థానభూమిఁ
తే. జెప్ప నేటికి సకలసం ♦ సిద్ధిఁ గోరి, దక్షిణాంభోనిధానంబు ♦ తటమునందు
సంప్రతిష్ఠింపుఁ డీశానుఁ ♦ జంద్రమౌళి, విశ్వలోకాధినాథు నో ♦ విబుధులార. 99

క. సిద్ధించు మీ కభీష్టము, సిద్ధ మిది యమర్త్యులార ♦ శీఘ్రమున జటా
రుద్ధశశి మహిమోపనిష, త్సిద్ధాంతరహస్యమును బ్ర ♦ తిష్ఠింపుఁ డిఁకన్. 100

తే. దర్శనముకంటె మేలు సం ♦ స్పర్శనంబు, సంస్పృశించుటకంటె న ♦ ర్చనములెస్స
యర్చనముసేయుకంటెన ♦ నంతఫలద, మసితగళుని బ్రతిష్ఠించు ♦ టమరులార.

సీ. సకలలోకప్రపం ♦ చమును లింగమయంబు-త్రిజగంబు లింగప్ర ♦ తిష్ఠితంబు
సంభవస్థితిలయ ♦ స్థానంబు లింగంబు-లీనార్థగమకంబు ♦ లింగ మనఁగ
లింగప్రసాదంబు ♦ లేక, సిద్ధింపవు-భోగమోక్షంబు లే ♦ యోగములను
లింగాజ్ఞ వెలిగాఁగ ♦ లేశమాత్రంబును-సంచలింపదుపో తృ ♦ ణాంచలంబు
తే. మంటినైనను లింగంబు ♦ మలిచి కొలుఁడు, ఇసుకనైనను లింగంబు ♦ నేర్చి కొలుఁడు
పేఁడనైనను లింగంబుఁ ♦ బెట్టికొలుఁడు, నీటనైనను లింగంబు ♦ నిలిపి కొలుఁడు: 102

వ. అని యుపన్యసించి యింద్రుండు తాసును లోకపాలకులును దివిజులునుం దమతమ-
పేర శివలింగంబులఁ బ్రతిష్ఠించిరి. 103

మ. హిమధామార్ధజటాకిరీటుఁ డభవుం ♦ డింద్రేశ్వరుం డింద్రుచే
నమరవ్రాతముతోడఁ గూడఁగఁ బ్రతి ♦ ష్ఠాంతంబు సం భక్తిసం
భ్రమతాత్పర్యసమగ్రిచేఁ గయికొనెన్ ♦ బాథోధివధ్వాపగా
విమలస్వర్ణసరోజపూజ హృదయా ♦ విర్భూతసంతుష్టుఁడై. 104

ఉ. ఆగమమంత్రతంత్రములు ♦ సాంగములై నడువంగ సర్వవి
ద్యాగురుఁడైన ప్రెగ్గడ బృ ♦ హస్పతితోడుగ వీతిహోత్రది
గ్భాగమునం బురందరుఁడు ♦ భక్తిఘటించిన వాసవేశ్వరున్
భోగివిభూషణుం గొలుచు ♦ పుణ్యుల కబ్బును భోగమోక్షముల్. 105

తే. ఇంద్రుఁడేఁటేఁట జాతర ♦ కేగుదెంచి, సప్తగోదావరమున సు ♦ స్నాతుఁ డగుచు
భుజగభూషణు నింద్రేశుఁ ♦ బూజసేయు, ధవళమందారతరుపుష్ప ♦ దామములను.
క. ఇంద్రప్రతిష్ఠితుం డగు, నింద్రేశ్వరుఁ గొలువ నెవ్వఁ ♦ డేకాగ్రతమై
రుంద్రమతిన సప్తసింధువు, నంద్రిషవణమాడునతఁడు ♦ నాకం బెక్కున్. 107
క. సకృదాలోకసమున మఱి, సకృదర్చన సకృదుపాస ♦ సకృద్దానతులన్
సకృదాలయప్రదక్షిణ, సకృజ్జపంబుల మహేంద్ర ♦ శంభుఁడు మెచ్చున్. 108
తే. ఐంద్రపదభోగ మెవ్వఁడే ♦ నభిలషించు, నాతఁ డింద్రేశ్వరేశ్వరు ♦ నాలయమునఁ
బ్రణవపంచాక్షరీమంత్ర ♦ పాఠనియుతి, నమ్మహాఫల మొందుఁ ద♦త్త్వార్థ మిదియు.
తే. స్నానదానాగ్నిహోత్రదీ ♦ క్షావిధాన, మంత్రవాదములైనక ♦ ర్మంబులొకటి
కోటిగుణితంబు శ్రీదక్ష ♦ వాటియందు, సప్తగోదావరేంద్రేశ ♦ సవిధభూమి. 110
వ. అటమీఁద సిద్ధేశ్వరస్థానంబు సిద్ధలింగాధిష్ఠితంబు ధర్మార్థకామమోక్షపురుషార్థ సంసిద్ధికై యాసిద్ధలింగంబు సిద్ధులచేతఁ బ్రతిష్ఠింపంబడి సిద్ధసాధ్యగంధర్వగీర్వాణవిద్యాధరారాధ్యం బై యుండు నా స్థానంబు దక్షయజ్ఞప్రాగ్వంశక్షేత్రంబు. 111
క. జపహోమదానయజ్ఞము, లుపవాసాదివ్రతంబు ♦ లొక్కొక్కటి కో
టిపరిమితంబులు సిద్ధే, శపదంబున సాధకులకు ♦ సత్యం బరయన్. 112
వ. మఱి యోగీశ్వరంబను స్థానంబునందు యోగీశ్వరేశ్వరుండు సనకసనందనాదియోగీశ్వరులచేతఁ బ్రతిష్ఠితుండని చెప్పంబడును. 113
గీ. అది భవాబ్ధితరణి ♦ యదిసాధకవ్రాత, కల్పవృక్ష మది జ ♦ గత్ప్రసిద్ధ
మది యుపాసకులకు ♦ నణిమాదికైశ్వర్య, లాభము నకుఁ గరత ♦ లంబుపసిఁడి. 114
సీ. మంకణుం డను మహా ♦ మౌనియోగీశ్వర-శ్రీమహాదేవుని ♦ శివు భజించి
బ్రహ్మసాక్షాత్కార ♦ పర్యంతమైనప్ర-బోధసంపదముక్తి ♦ పాలముగాంచె
నొకమాఱు సప్తసిం ♦ ధూదకంబులఁ గ్రుంకి-నరుఁడు యోగీశ్వరే ♦ శ్వరునిగాంచ
నణిమాదికాష్టవి ♦ ధైశ్వర్యసంసిద్ధిఁ-బొందు యోగీశున ♦ ర్ధేందుధరుని
తే. సప్తగోదావరమునీట ♦ జలకమార్చి, పుష్పగంధాక్షతంబులఁ ♦ బూజచేసి
కలిక్షవం బైన కలుషంబుఁ ♦ గ్రాఁచిపుచ్చి, మర్త్యుఁ డొందును వేగం బ ♦ మర్త్యపదవి.
వ. మఱియు యమేశ్వరలింగంబు యమప్రతిష్ఠితంబు సకృద్దర్శనమాత్రంబున మర్త్యుండు యమభయంబునుం బాయు వెండియు. 116
సీ. యజ్ఞతటాకంబు ♦ నందుఁ గ్రుంకులు వెట్టి-బ్రహ్మర్షిపితృతృప్తిఁ ♦ బ్రస్తరించి
యమలింగసన్నిధి ♦ నష్టోత్తరసహస్ర- సంఖ్య మృత్యుంజయ ♦ జపముఁ జేసి

జపవిధానమునందు ♦ నరవిమృత్యుంజయయు - నపమృత్యుభయశాంతి ♦ నర్థి నడుగ
నపమృత్యుదేవతా ♦ హంకారభవమైన - సంతాపిస మొందఁడు ♦ సాధకుండు

తే. శ్రాద్ధపిండోదకాదివి♦శాణనముల, శ్రీయమేశ్వరతీర్థానఁ ♦ జేసి మనుజుఁ
డుద్ధరించును నరకకూ ♦ పోదరముల, బెగ్గడిలు నేడుతరముల ♦ పితృగణముల. 117

క. శ్రీకాళేశ్వరుసన్నిధి, నేకాంతము జపము వేల్మి ♦ యోగియు శ్రాద్ధం
బేకైకము కోటిగుణం, బై కలిగించును సమగ్ర ♦ మైనఫలంబుల్. 118

తే. వీరభద్రాదిదేవతా ♦ వీరగణము, శంభులింగంబు నిలిపెఁ బ్ర♦శస్తవేళ
దక్షవాటిఁదదాఖ్యసం ♦ స్థాపనమున, వీరభద్రేశుఁడయ్యెన ♦ వ్వేల్పు ఱేఁడు 119

క. శ్రీవీరభద్రలింగము, సేవించిన మానవుండు ♦ చిరకాలమునం
గేవలగాణాపత్యము, హావిభవము నొందు శివుని ♦ యాస్థానమునన్. 120

తే. వీరభద్రేశదేవతా ♦ విభునియాజ్ఞఁ, గలుగుధర్మార్థకామమో ♦ క్షములుజనుల
కక్షయంబైన దక్షవా ♦ టాభిధాన, భోగమోక్షరమాజన్మ ♦ భూమియందు. 121

తే. అగ్నిహోత్రంబు దాన మ ♦ ధ్యయనజపము, లాదియగునిత్యనైమిత్తి♦కాదివిధులు
బహుఫలంబుల నొసఁగు న ♦ ద్భక్తియుక్తి, దక్షవాటికవీరభ♦ద్రస్థలమున. 122

ఉ. యాగతటాకతీర్థమున ♦ యందును నంబుధిసార్వభౌమది
గ్భాగవిభూషణం బయినే ♦ పద్మినియందును దీర్థమాడి ని
ష్ఠాగరిమంబునం ద్రిపుర ♦ శాసను దక్షపురోపకంఠధా
త్రీగృహమేధిఁ గొల్వఁడు ప్ర ♦ తిష్ఠితభర్గుని వీరభద్రునిన్. 123

వ. తొల్లి బ్రహ్మాదు లగుదేవతలు సురేంద్రవిహితవిభవుండైన భీమనాథేశ్వరు దర్శించు వేడుకంజేసి బ్రహ్మలోకంబుననుండి భోగమోక్షక్షేత్రంబైన దక్షారామంబునకు వచ్చి సప్తగోదావరంబునఁ బంచతీర్థంబులాడి పండ్రెండు దివ్యలింగస్థానంబులు దర్శించి యమృతమయస్వయంభూజ్యోతిర్లింగమూర్తి నిఖిలదేవతాచక్రవర్తి యగు భీమేశ్వరేశ్వరు దర్శించి పరమానందకందళితస్వాంతులై యిట్లనిరి. 124

## బ్రహ్మాదులు భీమేశ్వరు వర్ణించుట.

శా. ఆహా! యెంతమనోహరంబగునె ద ♦ క్షారామ మివ్వీటిలో
నీహారాంశుకళాకిరీటుఁడు భవా ♦ నీభర్త దివ్యాప్సరో
వ్యూహంబుల్ ప్రతిసంధ్యయుం గొలువఁగా ♦ నున్నాఁడు గోదావరీ
వాహీన్యబ్ధిసమీరపానకలనా ♦ వర్థిష్ణుకేయూరుఁడై. 125

క. ముంగిటను సప్తసింధువు, చెంగటఁ గ్రతుసరసి నడుమ ♦ శ్రీభీమమహా
లింగము దక్షారామము, సంగతి నెన్నంగఁ బురము ♦ జగతిం గలదే. 126

తే. శివశివా యెంత భాగ్యంబు ♦ చేసినారొ, దక్షవాటీపురీమహా♦స్థానజనులు
కన్నులారంగ వీక్షింపు ♦ చున్నవారు, భీమనాథేశ్వరేశ్వర ♦ స్వామిమూర్తి. 127

చ. అహహా! దయారసానుగత ♦ మైన మనంబున దక్షవాటికా
గృహపతి భీమనాయకుఁడు ♦ కీటపతంగసరీసృపాళికిన్
సహజగళత్సమీరమగు ♦ సంకటకాలము వీనులం దను
గ్రహమొనరించునట్టి మధు ♦ రంబగు తారక మంత్రరాజమున్. 128

సీ. భీమనాథేశ్వర ♦ శ్రీమన్మహాలింగ-భాస్వత్పరబ్రహ్మ♦భవనమునకుఁ
గల్పాంతసమయభీ ♦ కరసాగరోద్ధత్య-భీతత్రిలోకమ ♦ హాతరికిని
ద్వాదశక్షేత్రతీ ♦ ర్థపలాశమండల-వ్యాకోచనవపుండ ♦ రీకమునకు
జంబూతరుద్వీప ♦ సర్వసర్వంసహా-పాటీరలేపనై ♦ పథ్యమునకు

గీ. శివకళత్రమునకు శివ ♦ క్షేత్రమునకు-శివునిమూర్తికి శ్రీసదా ♦ శివునికీర్తి
కితరతీర్థంబు సరిపోల్ప ♦ నెట్లువచ్చు, దక్షవాటంబునకు మహా ♦ స్థానమునకు. 129

క. మంకణమహామునీశ్వర, సంకల్పవితీర్ణకల్ప ♦ శాఖికి భువనా
లంకృతికి దక్షవాటికి, శంకరనటనటననాట్య ♦ శాలకు జేజే. 130

క. కాశీప్రతిబింబమునకుఁ, గాశీప్రతినిధికిఁ గాశి ♦ కాప్రకృతికెనిం
గాశీప్రతిమకు దక్షిణ, కాశికి శ్రీదక్షవాటి ♦ కటకంబునకున్. 131

క. మోక్షస్థానంబునకున్, దక్షారామమున కమృత ♦ ధామంబునకున్
దక్షాధ్వరక్రియోచిత, దీక్షాక్షేత్రమున కభవు ♦ దేవికి జేజే. 132

వ. అని నమస్కరించి శతానందుండు. 133

మ. శివలింగంబుఁ బ్రతిష్ఠచేసి కణఁకన్ ♦ శ్రీసప్తగోదావరాం
బువులం జేసెను మంత్రపూర్వకముగాఁ ♦ బుణ్యాభిషేకంబు వై
భవముల్ పెక్కువిధంబులం జరపె శ్రీ ♦ బ్రహ్మేశ్వరుం డంబుజో
ద్భవవంద్యుం డది యాదిగాఁ గరుణమైఁ ♦ బాలించు భక్తావళిన్. 134

వ. అంతదేవసిద్ధసాధ్యవిద్యాధరగంధర్వోరగాదులును దమతమ నామధేయంబుల లింగం
బులఁ బ్రతిష్ఠించిరి తదనంతరంబ. 135

సీ. బ్రహ్మప్రతిష్ఠితు ♦ బాలేందుశేఖరుఁ-బురుహూతుఁ డతిభక్తిఁ ♦ బూజచేసె
నలువయర్చించె నా ♦ నాప్రకారంబుల-హరిహయస్థాపితుం ♦ డగుమహేశు

దక్షవాటికఁజూచి ♦ దక్షప్రజాపతిఁ-బొగడె నల్లోర్ల నం♦భోజభవుఁడు
ప్రణమిల్లె దక్షుఁడు ♦ భారతీభర్తకు-నాత్మప్రశంసకు ♦ నణఁగి మదిని
తే. వేల్పులందఱుదారును ♦ నిల్పినట్టి, శంభులింగంబులకు మ్రొక్కి ♦ చనిరి దివికి
సరసిజాసనుచే నను ♦ జ్ఞాతులగుచు, సత్యలోకంబునకు నర్థిఁ ♦ జనియెవిధియు. 135
క. బ్రహ్మప్రతిష్ఠితుండగు, బ్రహ్మేశ్వరదేవుఁగొలుచు ♦ భాగ్యాఢ్యులకుం
బ్రహ్మక్షత్రాదులకును, బ్రహ్మాచ్యుతశంభుభవన ♦ పదవులు గలుగుక్. 136
క. అధ్యయనశ్రుతదానత పోధ్యానసమాధిమంత్ర ♦ పూజాదిమహా
విధ్యనుసంధానమున న, సాధ్యంబులు లేవు బ్రహ్మ ♦ శంకరుపదవిక్. 137
వ. మఱియుఁ గపాలేశ్వరస్థానంబు. 138
ఉ. చిక్కటి కాలభైరవుని ♦ చేతివిధాతృకపాలపాత్ర యే
చక్కటియందు జాఱిపడె ♦ సప్తనదీతటభీమభూమియం
దక్కడనుద్భవించిన శ ♦ శాంకకిరీటుఁ గపాలి శంభు స
మ్యక్ప్రతిఁ గొల్చు మానవుల ♦ మానుగఁ జేరవు పాతకౌఘముల్. 139
తే. ఆకపాలమోచ ♦ నాభిధానం బైన, పుణ్యతీర్థరాజ ♦ మునను జలుపఁ
గడిఁదిఁ గోటిఫలముఁ♦గాంచునొక్కొక్కటి, దానహోమయజ్ఞ♦తంత్రవిధులు. 140
చ. అట వరుణేశ్వరం బనగ ♦ నాదిఁబ్రచేతసుచేత వాహినీ
తటమునఁ దొంటి నిల్పఁబడి ♦ దక్షమహేశకరారవిందసం
పుటమునకుక్ వరాటకము ♦ ప్రూలె వెలింగెడు బాలతారకా
విటమకుటావతంసునకు ♦ విశ్రమకారణమై తపోనిధీ. 141
తే. వరుణలింగంబునకుఁ దీర్థ ♦ వారిధార, వేయిఘటముల నభిషేక ♦ విధియొనర్ప
వఱపుదోనంబు వాయంగ ♦ వానగురియుఁ, గొంద్రఁడలంబందు నారబ ♦ కోటులెల్ల.
ఉ. కుక్కుటపక్షిసంఘము ల ♦ కుంఠితభక్తిఁ బ్రదక్షిణంబు స
మ్యక్ప్రతిఁ జేసి యెవ్వని కృ ♦ పాతిశయంబున మోక్షసత్పదం
బెక్కె సమస్తలోకముల ♦ కెల్లఁబియుం దరుణేందుశేఖరుం
గుక్కుటనాథదేవు ఫణి ♦ కుండలునిం గొలువుండు మానవుల్. 143
తే. ఒక్కపక్షంబులెంతయు ♦ నుర్విమోవ, గుడిఁ బ్రదక్షిణ మొనరించు ♦ కుక్కుటముల
కక్షయంబగు మోక్ష మే♦యయ్యెయొసఁగె, నట్టి శివుఁగుక్కుటేశ్వరు♦నాశ్రయింతు.
క. చరణాయుధేశ్వరేశ్వరు, శరణాగతకల్పతరువు ♦ సంపూర్ణమహా
కరుణాశరుణాలయునిం, గరుణామృతకిరణధరుని ♦ దర్శింపవనా. 145

క. కోణార్కక్షేత్రము వా, రాణశి కేదారతీర్థ ♦ రాజము కుంభీ
కోణంబు కుక్కుటేశ, స్థాణుస్థానంబు మోక్ష ♦ ధామములెందున్. 146

తే. అచట దానంబు హోమ ♦ మధ్యయనవిధులు, శ్రాద్ధమును దేవతాసమ ♦ ర్చనము వ్రతము
లొక్కటొక్కటి కోటిగు ♦ ణోపలబ్ధి, సంభవించును సతతంబు ♦ సాధకులకు. 147

వ. మఱియు సోమేశ్వరతీర్థంబు సర్వదేవతా నమస్కృతంబు. 148

క. అమృతమయుఁడైనసోముఁడు, సమయంబున నే మహేశు ♦ సంస్థాపించెన్
విమలసుధాజ్యోతిర్లిం, గము సోమేశ్వరుని గరళ ♦ కంఠు భజింతున్. 149

సీ. సోమతీర్థమునందు ♦ సుస్నాన మొనరించి–శ్రీసోమశంభు భ ♦ జించు ధన్యుఁ
డిహజన్మమునయందు ♦ నే పాప మొనరించెఁ–బాప మెద్ది యొనర్చెఁ ♦ బ్రాగ్భవమున
నది యశేషంబును ♦ నాక్షణంబునఁబాసి – దేహాంతమునఁ గూడుఁ ♦ద్రిపురహరుని
ద్యాగంబు భోగంబు ♦ దానంబు సత్యంబు – భాగ్యంబు కీర్తి సౌ ♦ భాగ్యలక్ష్మి

తే. బుద్ధి తత్సేవ నత్యంత ♦ వృద్ధిఁ బొందు, సతతధర్మంబు నిచ్చు న ♦ క్షయఫలంబుఁ
దతఫలంబులు పితౄర్థ్వ ♦ దైహికములు, సత్య మిది సోమనాథప్ర ♦ సాదమహిమ.

క. సురలును విద్యాధరులును, గరుడోరగకిన్నరులును ♦ గంధర్వులు కిం
పురుషులు యక్షులు సోమే, శ్వరదేవునిఁ గొల్తు రధిక ♦ వరభక్తిమెయిన్. 151

వ. మఱియు మాహేశ్వరతీర్థంబు సర్వదేవనమస్కృతంబు మునిసిద్ధచారణవిద్యాధరుల
చేతఁ బ్రతిష్ఠితంబైనయది పితృపిండదానం బేకవింశతికులంబునకుఁ దృప్తికరంబు. 152

తే. సప్తగోదావరంబను ♦ సారతీర్థ, ముత్తమోత్తమ మందు ♦ మర్త్యుండు చేయు
శ్రాద్ధతిలతర్పణాదు ల ♦ క్షయఫలములు, తత్సదాసేవనము శివ ♦ స్థానదంబు. 153

తే. దత్తమిష్టంబు హుత మధీ ♦ తంబు నరుల, కచట నక్షయఫలముఁ జే ♦ యుంగఁజాలుఁ
శ్రాద్ధపిండప్రదానాది ♦ సకలవిధులు, నందు ఫలియించు నగ్గయ ♦ యందుఁబోలె.

క. మఱి రామేశ్వరతీర్థము, కలికంఠున కాటపట్టు ♦ కామితఫలముల్
తలఁగనిధాన్యములగుచును, నెఱయంగ ఫలించు నందు ♦ నిష్ఠయుఁ గలుగున్. 155

క. శ్రీరుద్రపాదయుగళీ, శ్రీరామేశ్వరసమీప ♦ సీమం బితృయ
జ్ఞారంభం బొనరింప న, పారఫలప్రాప్తిఁ జెందుఁ ♦ బంచజనులకున్. 156

తే. ప్రథిత మగు సప్తగోదావ ♦ రంబునకును, నభవునకు భీమనాథున ♦ కంతరమున
నేమి సుకృతంబు చేసిన ♦ నేకతంబ, వేయు విధముల ఫలియించు ♦ వేయు నేల. 157

సీ. వినుము పారాశర్య ♦ వేవేలమాటలఁ–బనియేమి తీర్థముల్ ♦ పదియు రెండు
నని చెప్ప నేల ద ♦ క్షారామమండలిఁ–దీర్థంబుగాని ప్ర ♦ దేశ మెద్ది

సప్తగోదావరో ♦ త్సంగస్థలమునకుఁ-గాశి కేదార మ ♦ క్షయవటంబు
తరముగా కితరతీ ♦ ర్థమ్ములు సాటియె-భోగమోక్షములకుఁ ♦ బుట్టినిల్లు
తే. రుద్రవాటిక భీమేశ్వ ♦ రునినివాస, మందు రామేశ్వరస్థాన ♦ మభ్యధికము
రామతీర్థంబునందు సా ♦ రంబుసాటి, ధర్మమర్మంబు రుద్రపా ♦ దస్థలంబు. 158

## అగస్త్యుండు వ్యాసునకుఁ బంచతీర్థంబుల వివరించుట.

వ. మఱియుఁ బంచతీర్థంబులు వివరించెద సవహితుండవై యాకర్ణింపుము. 159
చ. అహిపతికంకణుండు తన ♦ యల్లుఁడుగా మదిఁ గోరి నిష్ఠతోఁ
దుహినధరాధరేంద్రుఁడు చ ♦ తుర్దశదివ్యమహాబ్దముల్ సుదు
స్సహముగఁ జేసె నయ్యెడఁ బ్ర ♦ చండతపం బచటన్ శివుం డను
గ్రహమున నుద్భవించె నని ♦ క్రచ్చఱఁ బల్కుఁ బురాణసంహితల్. 160
క. ఆదియాదిగఁ దీర్థంబులు, పదియును రెండయినఁదీర్థ ♦ పాళీజాతం
బదియ కడు నెక్కుడై యు, న్నది సప్తతటంబునందు ♦ నన్మునివర్యా. 161
క. లంకించియరుంధతిపతి, మంకణునకుఁ జెప్పె సనుఁగు ♦ మామకు గిరికిన్
సంకల్పసిద్ధిదుండగు, శంకరుఁ డఖిలార్థిపారి ♦ జాతంబనుచున్. 162
క. గిరిసార్వభౌమకన్యా, కరగ్రహణసుమంగళైక ♦ కౌతుకసంప
త్పరిపూర్ణహృదయు శ్శంకరుఁ, గరుణాకింకరుని నురగ ♦ కంకణుఁగొలుతున్. 163
క. నీహారభూధరేశ్వరు, నీహారమణీయమూర్తి ♦ నిందుకరహిమా
నీహారహీరకుముదసు, ధాహారసమానకాంతి ♦ నభివర్ణింతున్. 161
సీ. భూధరేశ్వరతీర్థ ♦ మునఁ గృతస్నానుఁడై-భూధరేశ్వరుఁగొల్చు ♦ బోధఘనుఁడు
నిత్యమంగళుఁడు ని ♦ ర్నిద్రభద్రుండును-లక్ష్మీవిలాసైక ♦ లక్ష్మయుతుఁడు
నగుఁ దీర్థములలోన ♦ నత్యుత్తమం బైన-తీర్థంబు భుక్తిము ♦ క్తిప్రదంబు
మంగళమంగళా ♦ త్మకముకళ్యాణక-ళ్యాణస్వరూప మీ ♦ యాస్పదంబు
తే. ధరణిధరనాయకునకుఁ బ్ర ♦ త్యక్ష మైన, యవ్విరూపాక్షనగరమ ♦ ధ్యాహ్నవేళ
భోగఘంటాస్వరము విన్న ♦ భూజనులకు, నవల వినవచ్చు ముక్తిక ♦ ళ్యాణఘంట.
మ. హిమవద్భూధరసార్వభౌమవరవి ♦ శ్వేశోపహారక్రియా
క్రమసంతాడితఘంటికాఘణఘణ ♦ త్కారంబు విన్నట్టి యు
త్తమపుణ్యుండు వినండు ప్రాణపవనో ♦ త్క్రాంతివ్యథావేళ దు
ర్దమవైవస్వతవాహ్యఘోరమహిష ♦ గ్రైవేయఘంటాధ్వనుల్. 166
తే. శ్రాద్ధపిండప్రదానాది ♦ సకలవిధులు, నొక్కటొక్కటికోటిగు ♦ ణోదయమునఁ
దృప్తిఁ గల్పించు దివిపితృ ♦ దేవతలకు, ధరణిధరరాజశంభుతీ ♦ ర్థంబునందు. 167

